# చైతన్యకవిత

**3**

ప్రభవ వసంతం

SPRING 1987



సంపాదకులు

డా. తంగిరాల సుబ్బారావు

డా. ఆర్వీయస్. సుందరం



చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry
published by Chaitanya Kavita Vedika
R-2, Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
April 1987, pp. xii + 70.

ముఖచిత్రం : ప్రజలగొడవే తన గొడవగా భావించి వాడిగా వేడిగా కవి తల్లి పలికించిన అచ్చమైన ప్రజాకవి కాళోజీ

వెల : రూ. 8–00 (వార్షిక సభ్యత్వం రూ. 10-00; ప్రత్యేక సభ్యత్వం రూ. 100–00; జీవిత సభ్యత్వం రూ. 200-00)

*For Copies* :

**Dr. T. V. Subba Rao**
Department of Telugu
Bangalore University
Jnana Bharati, Bangalore-560·056

**Dr. R. V. S. Sundaram**
Department of Telugu
University of Mysore
Manasagangotri, Mysore-570 006

ఈ వసంత సంచిక ప్రచురణకోసం వెయ్యి రూపాయల ఉదార విరాళాన్ని ఇచ్చిన సహృదయ సార్వభౌములు శ్రీ పి. వి. రమణయ్య రాజాగారికి కృతజ్ఞతాపూర్వక నమస్సులు

ముద్రణ :

మిత్ర ప్రింటర్స్, విద్యారణ్యపురం, మైసూరు-8.

# ప్రజాకవి కాళోజీ

—డా. ముదిగొండ వీరభద్రయ్య

కవివ్యక్తి, కవి వాక్కు, కవి ఆచరణ-అన్న మూడూ ఏకమైన కవి ఎవరైనా తెలుగు వాళ్లలో ఉంటే వాళ్లలో మొదటివాడు కాళోజీ. క్రోధమూ, తిరుగుబాటూ, కన్నీరూ, వేదనా, ప్రేమా, అహింసలు దేనికవిగా కానీ, కలిపి కానీ ఎక్కడైనా ఉన్నవీ అని అంటే అది కాళోజీ. వెనుకబడిన ప్రాంతమనీ, ప్రజలలో చైతన్యం లేదనీ నిందలు మోసే తెలంగాణా ప్రజల శక్తిని "అయ్యా వానిసను, అనిన పౌరుడే-అయ్య గొంతుక నట్టే అదుమున్" అని ఏనాడో గ్రహించిన మొదటి కవి కాళోజీ. జైలంటే, పోలీసంటే, రజాకార్ గూండాలంటే, రాజంటే భయం లేనివాడు; ప్రాణమంటే తీపి లేని వాడు. అహింస తుపాకి కన్నా బలమైనదని అనుభవ పూర్వకంగా తెలిసికొని, తెలిపినవాడు. "కైత చేత మేల్కొల్పకున్న కాళోజీ కాయము చాలింక" అని కవిత్వశక్తిని నమ్ముకొని దాన్ని ఆశ్రయించినవాడు. అంత పవిత్రమైన కవిత్వాన్ని అమ్ముకోడం నేరమని త్రికరణశుద్ధిగా నమ్మి ఆరు ఋతువుల్లో (పరాభవ సంవత్సరం) ఆరు "నా గొడవలు" అచ్చేసి ఉచితంగా పాఠకుల కిచ్చిన తొలి తెలుగు కవి. కవులను గౌరవించడంలో ఆయన్ని మించినవాడు లేడు. వయస్సులో తారతమ్యాలు చూడని వాడు. ప్రజల మనిషి, పల్లెపల్లె తిరిగినవాడు. ప్రతిగుండెలోనూ నివసించేవాడు. ఏ ఇంటికెళ్ళినా 'ఎప్పుడొచ్చినవ్ కాళన్నా' అని అడిగే వాళ్ళే. ఏ రాజకీయ పక్షంలోనూ లేకుండానే స్వాతంత్ర్యానంతరం కూడా నిరంతర రాజకీయ, సామాజిక చైతన్యంతో పొంగిపోతున్నవాడు. ప్రఖ్యాత ఉర్దూ కవి, వరంగల్లులో జనకమహర్షిలాంటి వాడన్న కీర్తి పొందిన కాళోజీ రామేశ్వరరావుగారికి తమ్ముడీయన, కులం లేనివాడు, మతం లేనివాడు, ప్రాంతం లేనివాడు. బంధువులు లేనివాడు, ఆయనకు మనిషి తప్ప మరెవ్వరూ లేరు. మరాఠీ, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు, తెలుగు భాషల్లో అధికారం ఉన్నవాడు.

భారతదేశం 1975 నుంచి 77 దాకా ఎమర్జెన్సీలో ఉన్నప్పుడు శ్రీకాకుళంనుంచి హిందూపురందాకా ఆయన ప్రతిచోటా ప్రహ్లాదోపాఖ్యానం

చెప్పాడు. వినేవాళ్లందరికీ దాని భావమేమిటో తెలుసు! ఒక్కమాట భాగవతంలో లేనిది ఆయన చెప్పలేదు. కాని.... అందరికీ అర్థమయ్యేది. తన చదువులని తన జీవిత కాలానికి వాడిన కాళోజీలాంటి మనుష్యులు అరుదు. పండితుడైనా పామరుడి మాటలో విలువేమైనా ఉంటే, నేర్చుకోదగిందేమైనా ఉంటే దాన్ని అనుసరించడంలో వెనక్కు పోడు.

కాళోజీకి శ్రీశ్రీ అంటే ఇష్టం, కాని కమ్యూనిజం అంటే పడదు. గాంధీజీ అంటే ఇష్టం. కాని కాంగ్రెస్ అంటే మంట. 'లా' చదివేడు, కాని లాయర్‌గా కొనసాగాడా? చివరికీ రోజుల్లో పి.యు.సి.ఎల్. కార్యకర్త. తనతో పాటే స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని స్వాతంత్ర్యం రాగానే మారిపోయిన వారిని గురించి "సత్తారాగానే కన్నులు–నెత్తికెక్కి పోతాయని-త్యాగులు సైతం గడియలో–భోగులయి పోతారని ఎవరనుకున్నారు?" అని బాధపడ్డారు. కవులకీ, ప్రజలకీ, ఉద్యమ కారులకీ, ప్రజాస్వామ్య వాదులకీ ఆయన పెద్దదిక్కు. నిస్వార్థ దేశభక్తుడు, త్రికరణ శుద్ధుడు, కవితా సిద్ధుడు. మహాత్మాగాంధి, జె. పి. లోహియా, గురజాడ, కందుకూరి, గిడుగు, శ్రీశ్రీ, తిలక్, వేమనలు కలిస్తే ఒక కాళోజీ, నిజం. కంబ రామాయణంనుంచి ఖలీల్ జిబ్రాన్ వరకు ఎక్కడ గొప్ప కవిత్వం ఉంటే అక్కడ పరవశించి పోతాడు. అనాటి నైజాంనుంచి ఈనాటి మనదేశపు 'నాజీ'ల వరకు ఎక్కడ ఎదుర్కోవలసి వచ్చినా, అక్కడ ఎదుర్కొని, ప్రజలకోసం నిలబడ్డాడు. ఆయన ప్రజాకవి, ప్రజల మనిషి, ఆకాశమంత విశాలమైనవాడు, ఎవరెస్టంత ఎత్తైనవాడు.

కాళోజీని గురించి

## ఎన్. గోపి

కన్నీళ్లు ఏడుంటే
కాళన్న ఆడుంటడు
కాళన్న ఏడుంటే
"కలేజా" గాండ్లు ఆడుంటరు-
గోడు అడ్డం పడ్తది కాళన్నకు,
ఎంతో చిక్కు సంగతులను
"గింతే" అని తేల్చేస్తడు కాళన్న
మూడు అంతరాలు చూసి
లావు లావు ఎగుర్తాండు
దమ్మున్న పోరగాల్లను
రమ్మని సవాలు జేస్తాండు
కాళన్న ముంగల
నువ్వన్న మాటలే నీ మీదికి తిరగబడతై
కాళన్న వెనకాల
ఆయనన్న మాటలే వినబడతై
కాళన్న కవిత్వానికి
అక్షరాలు వాలై
కాళన్న గర్జిస్తే
కాయితాలు వొనుకుతై
కాళన్న మాటలు
పునాదులల్ల ఆడుకునే పసిపిల్లలు
లొసుగుల్లేవు
ముసుగుల్లేవు
సిసలైన వ్యవహారం కాళన్నది
కాళన్న అడుగుపెట్టిన ఇల్లు
కాళన్న మెట్టిన ఇల్లే
కాదంటే ఆ ఇల్లాలు
కాళన్న ఒడిలో పిల్లే
కాళోజీ అడుగులు పడ్తే బాలు
'కాళోజీ తాత' అంటూ

వీధులు వెంట ఒడత్తై
నువ్వాయనకోసం పోయినప్పుడు
నీ కోసం అయన
మీ యింట్లుంటడు
కవిత్వాలు కాయిదాలు
చదువుకున్నోన్ని అటుబెట్టు
కష్టనిష్ఠూరాలు తెలిసిన ప్రతోడు
కాళన్న ముందు కరిగిపోతడు
కష్టనిష్ఠూరాలు రెండూ
కాళన్న ముందు కరిగిపోతయి
కాళన్న ఒక మెత్తని వజ్రం
కాళన్న కాళన్నే

## అమ్మంగి వేణుగోపాల్

అతడు
గడ్డిపోచను తలదాల్చే హిమశిఖరం
మొగ్గలపై కురిసినప్పుడు మంచు
'రాజ'కీయాలను గాయపర్చినప్పుడు
అతని వ్యక్తిత్వం కత్తి అంచు.

ఉపన్యాసం
ఉద్యమానికి ఊపిరి
వ్యాఖ్యానం
కవి హృదయానికి దర్పణం.

మేఘమై గర్జించినా
మెరుపుదాడి చేసినా
కంట తడిపెట్టినా
కవిత రాసినా
ప్రజలకోసం.

తెలంగాణా అతని ఊరు
త్రికరణశుద్ధికి మారు పేరు.

# చైతన్య ప్రభవ

నిరంతరం ముందుకు సాగే కాలగమనంలో మరో వసంతం ప్రభవించింది. ఈ వసంతం మళ్ళీ మళ్ళీ క్రొత్తక్రొత్తగా రాబోయే వసంతాలకు దారియిస్తూనే ఉంటుంది. మన ప్రయత్నం మనం చేయాలి, ఇందులో ఏ మాత్రం మంచి ఉన్నా ముందు తరాలవారు దాన్ని అందుకుని ముందుకు పోతారనే నమ్మకం మా చేత కవిత్వ సంచిక ప్రచురించే సాహసాన్ని చేయిస్తూ ఉంది. సహృదయులైన కవులు, విమర్శకులు ఇలాంటి సాహసానికి చేదోడు వాదోడుగా ఉంటారనే నమ్మకం కూడా మాకుంది.

కవులెంత ప్రసిద్ధులైనా ప్రజల హృదయాల నలంకరిస్తారు కాని పత్రికల ముఖ చిత్రాలనలంకరించరు. రెండవ సంచిక ముఖచిత్రంగా పఠాభిగారి ఫోటో వేయడాన్ని మిత్రులెందరో ప్రశంసించారు. ఈ పద్ధతి నిలాగే కొనసాగించమన్నారు. ఈ సారి కాళోజీగారి ఫోటోతోబాటు చిన్న వ్యాసమూ రెండు కవితలు కూడా ప్రచురిస్తున్నాం ఇది సాహిత్య క్షేత్రంలో ఔత్సాహికులకూ విద్వాంసులకూ సంతోషం కలిగిస్తుందని భావిస్తున్నాం.

శ్రీ కాళోజీ నారాయణరావుగారి ఫోటో తీయించి ఇచ్చిన ప్రియమిత్రులు శ్రీ యస్ నారాయణ రెడ్డిగారికీ, పరిచయ వ్యాసం వ్రాసిన డా. ముదిగొండ వీరభద్రయ్యగారికీ, కాళోజీని గురించి తాము వ్రాసిన కవితల్ని తిరిగి ముద్రించుకుందుకు అనుమతించిన కవి మిత్రులు డా. ఎన్. గోపిగారికీ డా. అమ్మంగి వేణుగోపాల్‌గారికీ ఈ సందర్భంలో కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాం.

ఎక్కువమంది విమర్శలు సంపాదించడం సులభంగాని సమ్మతి సంపాదించడం సులభంకాదు. రాజకీయ వాతావరణం, సామాజిక దృక్పథంలో వైరుధ్యాలు, సంకుచిత దృష్టితో కూడిన పంథాలు సాహిత్య క్షేత్రాన్ని కూడా కలుషితం చేస్తున్న ఈ తరుణంలో అందరినీ కూడగట్టుకుని రావడం అసాధ్యం. పద్యాలు వేస్తే ప్రగతి వాదులకు కోపం, విప్లవ కవిత్వం వేస్తే సంప్రదాయవాదులకు కోపం. "గాడిదనూ గుర్రాన్నీ ఒక్క గాట కట్టివేస్తున్నారు" అని ఇద్దరూ అంటారు. ఎవరికి వారే తాము గుర్రాలమనీ, ఎదుటివారు గాడిదలనీ అనుకుంటారు (గుర్రాల్లో కూడా జట్కా గుర్రాలూ, రేసుగుర్రాలూ, ముసలి గుర్రాలూ ఉన్నాయి. మధ్యరకంగా కంచరగాడిదలూ ఉన్నాయి).

కవిత్వాన్ని గుర్తించడంలో కూడా ఎన్నో భేదాలున్నాయి. ఎవరికి వారే మేము కవిత్వాన్ని ఎక్కడున్నా గుర్తించగలం అంటుంటారు. మళ్లీ తమకు నచ్చిన వారిదే యుగయుగాలవరకు నిలవగల్గిన కవిత్వమంటారు. నచ్చిన వారిని గురించి వ్యాసాలు, పుస్తకాలు, పీఠికలు రాసి పొగుడుతారు. ఇతరుల పనుల్లో మాత్రం రంధ్రాన్వేషణ చేస్తూ ఉంటారు. ఇవన్నీ ఇలాంటి పత్రికలు నడపాలనుకున్నవారికి తప్పవు. దీన్ని గుర్తించి ముందుకు పోవడమే మా పని.

"యువకులైన మమ్మల్ని ప్రోత్సహించండి" అని ఎంతోమంది రాస్తున్నారు. "పేరున్న పెత్త కవుల రచనలు వెయ్యడంకన్నా పేరులేని యువకుల మంచి రచనలు వెయ్యండి" అని ఎంతో మంది కవిమిత్రులే సలహాలిచ్చారు. ఏ మాత్రం భాషాసాధన భావసాధన లేకుండానే కవులనిపించుకోవాలనే తాపత్రయం అనేకుల్లో కనిపిస్తోంది. ప్రతిభావంతులైన యువకులు ప్రామాణికంగా కొంత సాధనకూడా చేస్తే మంచి కవిత్వం రాయగలరు. అలాంటి వారికి ప్రోత్సాహం ఇస్తూనే ఉన్నాం, ఇక ముందూ ఇస్తాం.

అనువాద కవితల్ని చాలామంది మెచ్చుకున్నారు. దేశవిదేశాల కవితల పరిచయంద్వారా ముఖ్యంగా యువతరం వారికి వైవిధ్యమయ కవితా దర్శనం లభ్యమవుతుంది. ప్రకృత సంపాదకుల అనువాదాలే కాక ఇతర ప్రముఖ కవుల అనువాదాలు కూడా ప్రచురించగల్గుతున్నందుకు సంతోషంగా ఉంది.

ప్రపంచంలో నోబెల్ బహుమతికి అత్యున్నత స్థానం ఉంది. సాహిత్యానికిచ్చే నోబెల్ బహుమతిని సంపాదించిన వారిలో చాలామంది కవులు కూడా ఉన్నారు. చైతన్య కవిత అనువాద విభాగంలో నోబెల్ ప్రశస్తి విజేతల కవితలు కొన్నిటిని ప్రచురించాలనుకుంటున్నాం.

చైతన్య కవితా వేదికద్వారా కొన్ని పుస్తకాలను కూడా ప్రచురించాలని సంకల్పించాం. ఈ ప్రభవ సంవత్సరమే షష్టిపూర్తి సంవత్సరంగా జరుపుకుంటున్న అపూర్వ వ్యక్తి శ్రీ శేషేంద్ర శర్మగారి కావ్యఖండికల్ని 'శేషేంద్ర చమత్కారికలు' అనే పేరుతో వెలువరించబోతున్నాం. ఆధునిక తెలుగు కవిత్వానికి శేషేంద్ర శర్మగారి రచనలు ఒక మలుపు నిచ్చాయనడంలో సందేహం లేదు. యువ రచయితల కీ చమత్కారికలు స్ఫూర్తిదాయకం కాగలవు. ప్రపంచ మహాకవుల కావ్యజగత్తును ఇలాగే పుస్తకాలద్వారా పరిచయం వెయ్యాలని ఆశిస్తున్నాం.

కవులు నిరంకుశులు, స్వతంత్రులు అనడానికి ఇటీవల జరిగిన ఒక సంఘటన నిదర్శనంగా ఉంది. ఇటీవల బంగ్లాదేశ్ నియంత ఢాకాలో అఖిల ఆసియా కవి సమ్మేళనం ఏర్పాటు చేశాడు. ఆ దేశంలో ఏ జరుగుతోందో

ఆ దేశపు కవులకు బాగా తెలుసు. వారు వేయిమంది సంఘటితమై వేరుగా పెద్ద ఊరేగింపు జరిపి, ఒక మహాసభ చేసి ప్రజల స్వాతంత్ర్యాన్నీ సామాజిక రాజకీయ స్వేచ్ఛనీ పరిరక్షించడానికి కంకణం కట్టుకున్నారు. నియంత జరిపిన సభను బహిష్కరించారు. ఇది ప్రపంచంలో ప్రతి కవీ గర్వించదగిన విషయం. మనం కవుల సంకలనాలను బహిష్కరించి అభివ్యక్తి స్వాతంత్ర్యాన్ని హరించే స్థితిలోనే ఇంకా ఉన్నాం.

ఏ పంథాకు, వర్గానికి చెందిన వాడైనా సరే కవిని, విద్వాంసుణ్ణి గౌరవించినప్పుడే ఆ సంఘం సంస్కృతీ విలసితమని అనిపించుకుంటుంది.

సంపాదకులు

## వేదిక నలంకరించిన కవులు

# సౌభాగ్య

## ఈ పుస్తకాలు

ఈ పుస్తకాలు
మనిషి మాటలు నేర్చిన నాటినుంచీ
మహా ప్రవాహాలుగా ఉబికి వచ్చే వూహా పరంపరలుగా సాగి
క్షణక్షణానికీ ఇటుకపై ఇటుక చేరి ఇల్లయినట్లు
మేఘాల్లోంచీ గాలికి వూగి తెగిన నీటి బిందువులు మహానదులైనట్లు
రాళ్ళ మీదుగా, భూర్జర పత్రాల మీదుగా
చర్మాల మీదుగా, ఫలకాల మీదుగా
పట్టు వస్త్రాల మీదుగా, తాటాకుల మీదుగా
సుదీర్ఘ ప్రయాణాలు చేసి, కాగితాలపై కళకళలాడుతూ
వేల వేల గ్రంథాలయాల వుద్యానవనాలై విచ్చుకుని
ప్రపంచాన్ని జ్ఞాన పరిమళాలతో నింపుతున్నాయి.
కాలాలకు ప్రతినిధులైన కవులో, శాస్త్రజ్ఞులో
కళావేత్తలో, చరిత్ర కారులో, మేధావులో
అనుభవాల్ని, ఆలోచనల్ని పుస్తకాల్లో నిక్షిప్తీకరించి
లోకాన్ని వెలిగించి భౌతిక నిష్క్రమణ చేస్తారు
ఎన్నో రాత్రులు, ఎన్నో పగళ్ళు, ఎన్నెన్నో సంవత్సరాలు
కొత్త జీవిత కోణాల్ని దర్శించడానికి
శరీరాణువులన్నీ అక్షరాలై ఆకారం దాలుస్తూ వుంటే
శల్యావశిష్టులై మట్టిలోకి మౌనంగా జారుకుంటారు.
ఈ పుస్తకాలు
అమృత బాష్ప బిందువులు
స్మృతుల్ని చైతన్యవంతంగా చూపించే అద్భుత దర్పణాలు
ఆకాశాన్ని చూడడానికి అక్షరాలతో కట్టిన సోపానాలు
అదృశ్య జీవుల అంతస్సారాలు
మానవ మస్తిష్కాల మహాతపః ఫలితాలు
పుస్తకాల్ని చూడగానే ఒళ్ళు పులకరిస్తుంది
లక్షల గ్రంథాలు చదవడానికి ఒళ్ళంతా కళ్ళు లేనందుకు
కళ్ళన్నీ కంప్యూటర్ వేగంతో కదల్నందుకు

కాలం ఇంత చిన్న వయసిచ్చినందుకు
పట్టరాని ఉద్వేగంతో కొట్టుకుంటుంది గుండె
బిగ్గరగా ఏడవలేని ప్రయత్నాన్ని
కొండల వృద్ధగ్రంథాలు కిటికీలోంచీ వుత్సాహంగా పరిశీలిస్తాయి
వలసపోతున్న పుస్తకాలై
మేఘాలు మెల్లగా జారుకుంటాయి
నింగి నీలిగ్రంథమై నివ్వెర పోతుంది.

అరణ్య సంచారాల్లో, మంచు మైదానాల్లో
అగమ్య గోచరంగా తిరుగుతున్న ఆటవికజాతులు
నాగరికత నేర్చుకున్ననాటి కథలు,
మతాలు భూతాలై మనుషుల్ని ఆవేశించి
దేశదేశాల మీదికి దండయాత్రలు జరిపిన దారుణ దృశ్యాలు,
మానవజాతి తొలిపొద్దులో పొడిచిన
మమతానురాగాల మంద పవనాలు
ప్రకృతి బీభత్సాలకి బెల్లాచెదరై
ప్రజానీకాలు జరిపిన ఖండ ఖండాంతర యానాలు,
రాజ్యాలకు రాజ్యాలే రాజుకుని
వేలవేల జీవితాలు విషాదంగా
మట్టిలో మాయమైన మారణ ఘట్టాలు,
దొరికిన తీరుబడిలో రాత్రింబగళ్ళకూ
రహస్యాలు నింపుకున్న రోదసిలోని గ్రహాల గమనాలకూ
కారణాల్ని అన్వేషించిన ఖగోళ చింతనలు,
ఆకాంక్షల, బోధలు, అభూత కల్పనలు, భావనలు
ఆకాశయానం చేసి పక్షులై పర్వతాలై జంతువులై జ్వాలలై
ప్రకృతిలో మమైకం చెందిన పసిపిల్లల కథలు,
పెంచుకున్న ఆశల్ని తుంచేసి
దేశదేశాల మధ్య జరిగిన యుద్ధాల్లో దేహత్యాగం చేసిన
ప్రియులతో, భర్తలతో ఆత్మాహుతి చేసుకున్న
జవరాళ్ళ జగదేక ప్రేమలు,
బతుకు తెరువు బాటలో దూర తీరాలకు విడిపోయి
కలుసుకోలేక పోయిన వాళ్ళ కడుపుతీపి కల్లోలాలు,

స్నేహమాధుర్యానికి పణమొడ్డిన
మిత్రుల చిత్రవిచిత్ర చరిత్రలు,
పచ్చ పచ్చని పొలాల్లో లేత వెన్నెల కన్నువిప్పిన ఏకాంతంలో
లోకాన్ని మరచిన
స్వచ్ఛ సరళ జానపద ప్రేమికుల ఆనంద పారవశ్యపు అంచులు,
అజ్ఞానాన్ని, అహంకారాన్ని, కరడుగట్టిన కండ కావరాన్ని ఎదిరించి
అన్వేషణలోనే అగ్నికి ఆహుతయిన అమరవీరుల ఆత్మార్పణలు,
ఆకాశాన్నంటే అలల మీదుగా
ఆత్మవిశ్వాసమే చుక్కానిగా ప్రయాణించి,
కొత్త కొత్త ప్రదేశాల్లో కోటి కోటి సమస్యల్ని ఎదుర్కొని
కాలు నిలదొక్కుకుని
కాలానికి ఎదురీదిన వాళ్ళ కష్టపరంపరలు,
ఒక్కో తెరనే తొలగిస్తూ
విశ్వావలోకనంతో విభ్రమం కలిగించిన
విఖ్యాత పురుషుల విశేష శ్రమలు,
సమస్త దేశాల్నీ కబళించాలని కలలుగని,
మరణ కిరణంలో మసై పోయిన
మానవ హంతకుల కిరాత కాండలు,
పోరాటం లేని,
ఆరాటం లేని
ప్రశాంత ప్రపంచంకోసం ప్రజల్ని సమాయత్తం చేసి
జైత్రయాత్రలు జరిపిన
మానవలోకపు మణిదీపాల పిలుపులు
రెప్పవాల్చని చూపులనించీ బయల్దేరిన అక్షరాలై, అన్వేషణలై;
ఆరాధనలై, ఆగ్రహాలై,వెలుగులై చీకట్లై ,రంగురంగుల పూలై రగిలిన జ్వాలలై,
ఎండై వెన్నెలై, కష్టాలై, సుఖాలై, కన్నీళ్ళై ఆనంద బాష్పాలై, ప్రేమలైయుద్ధాలై
జన్మిస్తున్న శిశువులై, మరణిస్తున్న మానవులై, ఆశలై నిరాశలై
దురాశలై దూసుకు పోతున్న రాకెట్లై
ఆలోచనల్ని వేన వేల సంవత్సరాల అనుభవాలతో నింపుతాయి.
పరిసరాల్తో జీవితాన్ని గాఢంగా బంధించి
నమ్మకాన్ని నరనరాలకూ ఎక్కించి
శోకమయ ప్రపంచాన్ని శోధించడం నేర్పుతాయి.

## ఎన్. గోపి

### యుద్ధశాంతి

చింతకాయలు రాలనట్టే
పద్యాలు రాస్తే కూడా యుద్ధాలు ఆగవు.
అంత్యక్రియలకు మాత్రం హాజరై
ఐరాస పాటించే నైరాశ్యమౌనంలో
శవాలు మళ్ళీ లేవవు.
మౌనం తర్వాత మళ్లీ యుద్ధం
అమ్రహెూ అనంతరం తిరిగి సమరం
ఇదో ఆట!
రణక్రీడా ప్రౌఢిమ అందామా!?
పద్యాలు ఏడిస్తే యుద్ధాలు వినవు.

జెనివాలో పెద్దన్నల చర్చలు
చర్చలు చర్చీలు కుర్చీలు
థాంక్యూలు పజలుస్తలు
ఏండ్ల తరబడి ఓంశాంతిశ్శాంతులు.
యుద్ధం తర్వాతగదా అశాంతి వొచ్చేది!?
శాంతి కోసం కదా యుద్ధం
పట్టండి ఆయుధాలు
పుణ్యంకోసం పాపం చెయ్యాలి తప్పదు
పద్యాలు పిలిస్తే యుద్ధాలు పలకవు.

గల్ఫ్‌లో
శక్తిని వెలిగించే నూనెలో
ఆరని రావణ కాష్టాలు.
శ్మశానంనుంచి ఇప్పుడే తిరిగొచ్చి
పాలస్తీనా పడతి మరో సూర్యుణ్ని ప్రసవించింది.

లెబనాన్ ఒళ్ళంతా గాయాలు
మలాం పెట్టడానికి చోటులేదు.
సిరియా వెన్నుపోటు
కొరియా నేల పాటు
గ్రెనెడా పిచ్చుకపై
అమెరికా బ్రహ్మాస్త్రం
అఫ్ఘనిస్తాన్, సైప్రస్, చాద్
ఎక్కడైతేనేం
చంపుతూనే అంటారు జిందాబాద్!
కంపూచియా పాపం!
చంపూచియా అని పేరు మార్చాలి
నికర్‌గువాలో ఆయుధాల గుహలు కడతారు
శ్రీలంక
ఎటూ తోచక తన కన్నే పొడుచుకుంటుంది.

పేర్లు బలే పెడతారు
గాడిద కొడుకులు!
శాంతి దళాలంట!
హత్యలు చెయ్యటానికి
ఆత్మహత్యా దళాలంట!
యుద్ధం అనివార్యం కాదు
యుద్ధం వ్యాపారం
యుద్ధం లాభసాటి పెట్టుబడి
ప్రాణాలు పెట్టుబడి
ప్రజలు ఆకలిని అమ్మి
ఆయుధాలు కొంటారు.
యుద్ధం గొప్ప దిగుబడి
ప్రాణాలు ఎరువు లేస్తే
అధికారం సంట పండుతుంది.
తిరుగుబాటు పొలాల్లో
డాలర్లు చల్లితే
వడ్డీతో సహా గిట్టుతాయి.

యుద్ధం అనివార్యం కాదు.
వెంటనే శాంతి వేదాల నోళ్లు మూయాలి
శాంతి బహుమతులు నిషేధించాలి.
పిల్లి శాంతి, నక్క శాంతి, కొంగ శాంతులను
తుంగలో తొక్కాలి.
రణ నిఘంటువులోంచి
శాంతి ఆరోపాన్ని తొలగించాలి.
కుహనా శాంతిని చంపితేగాని
యుద్ధం చావదు
అప్పటి దాకా
పద్యాలు వీచినా యుద్ధాలు కదలవు.

"నా చైతన్యమంతా
సప్తసముద్రాల సహస్రప్రకోటి బాహువుల
మెరిసే నురగై ఛుయ్యిమంది
నా ఎముకల మూలుగులో
చంద్రోదయమైంది
నా శరీరం
కాశ్యప భస్మరాశియై తరళించింది
నా ప్రాణం భగీరథుడైంది–
నా వెన్నెముక మీద
ఆకాశగంగా జలపాతం వర్షించింది
నా పొత్తికడుపు
హిమాచలతనయ
తన చల్లని మంచు హస్తాలతో నిమిరింది
రవం నీరవానికి Diminutive!!!" —నారాయణబాబు

# అద్దేపల్లి రామమోహనరావు

## రక్తంలో సమతా సంగీతం

చీకటి మీద ద్వేషంలాటి తెలుపు
స్వేచ్ఛమీద అనురాగంలాటి రెక్కలు
సమతమీద అనుబంధంలాటి సౌందర్యం
ఆ పావురం ఎగురుతోంది ఆకాశంలో....

తానెగురుతున్న గాలి దోవలన్నీ
సుమధుర సంగీతాన్ని ప్రతిధ్వనించేటట్లు
తానెగురుతున్న నింగి వంపులన్నీ
మానవతా సౌరభాల్ని ప్రతిబింబించేటట్లు
ఆ పావురం ఎగురుతోంది ఆకాశంలో....

ఆ విహంగాన్ని చూస్తున్న లోకుల కన్నులు
భవిష్యదాశా స్వప్నాల పూల జల్లులు విరజిమ్ముతున్నై
ఆ విహంగాన్ని కీర్తించే లోతుల గళాలు
సామ్యవాద గీతాల పాలవెల్లులు వెదచల్లుతున్నై
ఆ పావురం ఎగురుతోంది ఆకాశంలో....

ఆ పావురాన్ని చూశాడొక ఆయుధ వర్తకుడు
వాడి కళ్ళనిండా అణుధూళి వలయాలు
వాడి భుజాలనిండా ప్రళయాగ్ని గోళాలు
వాడు సమతా సౌందర్య విరోధి
వాడు ప్రపంచ భవిష్యత్ నిరోధి
వాడు స్వేచ్ఛని సహించలేడు—
అందాన్ని భరించ లేడు—

పావురాన్ని చేతిలోని తుపాకితో పేల్చాడు
పావురం తెల్లని దేహంనుండి ఎర్రని నెత్తురు బొట్లు

అది ఎగురుతున్న ప్రతిచోటా నేలమీద రాలుతున్నై
ఆ పావురం మాత్రం ఎగురుతూనే ఉంది
ఆ పావురం మాత్రం ఎగురుతూనే ఉంటుంది–
దాని నెత్తురు బొట్టు పడ్డ ప్రతిచోటనుండి
మొలుస్తున్నై తిరుగుబాటు మొక్కలు
ఆయుధవర్తకుడు చూస్తుండగానే
ఆ మొక్కలు క్షణక్షణానికీ పెద్దవై
ఆకాశంనిండా అగ్ని కొమ్మలతో పందిళ్ళు కడుతున్నై

ఆయుధవర్తకుడు తప్పించుకోలేడు
ఆ అగ్ని అతణ్ణి మట్టుపెట్టక తప్పదు
ఆ పావురం మాత్రం అలా ఎగురుతూనే ఉంటుంది
సమతా సంగీతాన్ని
ప్రపంచమంతా వెదచల్లుతూనే ఉంటుంది.

"అటు చూడు సముద్రం, నేస్తం,
హర్షానికి పర్యాయపదం;
ఇటు చూడు విహాయస నేత్రం
దుఃఖానికి అధ్యాహారం!
ఈ రెండిటి మధ్య నిలిస్తే
నీ లోపల లోలో పలికే
ఆలాపన లాలోకిస్తే
వినబడదా ఒక సంగీతం,
విడివడదా ఒక సందేశం!" —శ్రీశ్రీ

## ఆచార్య తిరుమల

### ఆవేశం

వర్షాలకు పొంగిపోయి
మండుటెండలకు క్రుంగిపోయే
సామాన్య నదిలాంటి
జన ప్రవాహాన్ని
నిర్వికార నేత్రాలతో చూస్తున్నాను!
ఉభయతీరాల ఇసుక తిన్నెల్లో
అదృష్ట–దురదృష్టాల్ని అంచనా వేస్తున్నాను!
గట్లమీద ఎన్నెన్ని చెట్లు!
ఆవలి పొలాల గుండెల్లో
ఎన్నెన్ని ప్రాణవాయువులు!
ఒక తీరాన–సుఖాలు తేలియాడే
నాగరికతా మహొద్ధతి
వేరొక తీరాన–కష్టజీవన
సౌందర్య మందస్మితంతో
గ్రామీణ వినమ్ర పద్ధతి!
నవీన–పురాణ తరంగాలతో
జనప్రవాహం!
ఒక నర్తకిలా–ఒక గాయకునిలా
ఒక నిశ్శబ్ద శబ్ద జీవన కావ్యంలా
జనప్రవాహం!
ఈ ప్రవాహాన్ని చూస్తుంటే–
నీకేమోగానీ
దీన్ని దాటాలని
నాకెంత ఆవేశంగా ఉంది!?!

## కోట్ల వేంకటేశ్వర రెడ్డి

### గుండె కింద 'తడి' కలవాడు!

కన్నీళ్ళ కట్టలు తెంచుకుని పారుతున్నా
అందరు వేతులు నరుక్కుని
కళ్ళు పొడుచుకుని పోతారెక్కడికో!
నాకు తెలియకుండానే ఓ కన్నీటి చుక్క
'టప్' మని బుగ్గమీద రాలుతోంది!
దోసిళ్ళు పారే కన్నీళ్ళను దాచుకుంటాయి
ఎక్కడో చీకటి ఖండంలో ఓ కలన్నా ఉరేసినా
ఇక్కడే మరో ప్రజాగళానికి సంకెళ్ళు వేసినా
ఎవరో కడుపులో చేయిపెట్టి కెలికినట్లవుతోంది!
మరో 'చీకటి సూర్యుడి' కలానికి నోబుల్ బహుమతి వస్తే
గుండె మీద మోయలేనంత ఆనందం కురుస్తోంది!
దీక్షతో పాఠం చెప్పాల్సిన పంతులు
చెట్టుకింద నుంచొని చుట్టతో కాలాన్ని కాల్చేస్తుంటే
ఎవ్వరో నా జేబును కత్తిరిస్తున్న అనుభూతి!
భక్తితో శ్లోకాలు వల్లించాల్సిన పూజారి దృష్టి
దక్షిణమీద శిలువేస్తే దేవుడంటె అసహ్యం వేస్తుంది!
వెన్నెల్లో ఆడుకోవాల్సిన అక్షరాలు చెవుల్లో
నగ్ననృత్యాలు చేస్తుంటే బావాలనిపిస్తోంది
కాకుంటే ఎవర్నన్నా చంపాలనిపిస్తోంది!
ఎవడన్నా తన కలాన్ని కుంచె చేసి
బతుకు చిత్రాన్ని గీస్తే తనివితీరా చూడాలనిపిస్తోంది!
'కాలం అంచుమీద నిలబడి' కవిత్వం చెప్పేవాడగుపిస్తే
హృదయం పోగొట్టుకోవాలనిపిస్తోంది!
ఎందుకంటే ఏం చెప్పను?
గుండె కింద చెమ్మగిల్లే 'తడి'ని ఎలా తుడవను??

## ఆసు రాజేంద్ర

### "తీయని అనుభూతుల్లో....మళ్ళీ"

నేను ఎప్పుడు పుట్టానో
ఎందుకు పుట్టానో
ఎలా పుట్టానో
తెలుసుకునే వయసు కాదు నాదప్పుడు.

ఇసుకలో పిచ్చుక గూళ్ళు కట్టుకుందుకు
గులకరాళ్ళను గుప్పెట్లో వేజిక్కించుకుందుకు
ఎండిన చెరువులో ఆలిచిప్పల్ని ఏరుకుందుకు
పరుగులు తీసే వయసది.

అడగ్గానే అమ్మ బెల్లంముక్క పెట్టలేదని
అక్కతో బాటే గోరింటాకు పెట్టలేదని
కోపంతో పలక పగలగొట్టి
భయంతో మంచం కింద నక్కి
నిద్రపోయే రోజులవి.

నాన్నమ్మ పోయినపుడు
అందరూ ఏడుస్తుంటే నేను ఏడ్చాను
ఎందుకో నాకే తెలియదు
పరామర్శకు తెచ్చే మిఠాయిల్ని తింటూ
అస్తమానం ఎవరైనా చచ్చిపోతే బావుణ్ణు అనుకునే వాణ్ణి.

నాన్నమ్మ ఏదని అమ్మని అడిగినపుడు
కొండమీదికి వెళ్ళిందని చెప్పినపుడు
ఆకాశంవంక ఆశగా అదే పనిగా చూసేవాణ్ణి
ఎక్కడైనా కనిపిస్తుందేమోనని.

ఎక్కడైనా ఎప్పుడైనా
చావుడప్పు వినిపిస్తే చాలు
భయంతో గుండె చేత్తో పట్టుకు
ఇంటికి పరుగెత్తు కొచ్చేవాణ్ణి

సీతాకోక చిలుక రెక్కల్ని పీకి
దారానికి కట్టినపుడు
చీమల్ని ఈగల్ని నల్లుల్ని
నలిపి చంపినపుడు
అమ్మమ్మ నన్ను కసిరి
అలాంటి పాపాలు చేసే వారు నరకానికి పోతారని
ఆ నరకాన్ని వర్ణించి చెప్పినపుడు
ఇంకెపుడూ
అలాంటి పాపం పనులు చేయనని
ముక్కు చెవులు గిల్లుకుని
ఒట్టేసుకునే వాణ్ణి.

స్కూలు ఎగ్గొట్టి
గంగయ్య దొడ్లో గోళీకాయలాడినప్పుడు
దుడ్డువారి చెరువులో చేపలు పట్టినపుడు
బజారులో బచ్చాముక్క లేరుకున్నపుడు
నాన్నగారి బెల్టు దెబ్బలకు నా వంటిపై తట్లుతేలేవి
నా వక్రమార్గాని కవి వంపులు తీసేవి.

పెరుగుతున్న వయసు–మనసు
చిన్నతనపు చిలిపి తనాన్ని ఛిన్నాభిన్నం చేసి
గంభీరతను గడ్డంలా మొలిపించాయి.
ఇపుడు
బాల్య స్మృతులను నెమరు వేసుకుంటుంటే
గతం గుండెమీద మరోసారి పుట్టి
అక్కడి చిలిపితనపు తియ్యని అనుభూతుల్తో
ఆడుకోవాలని వుంది.

# కందాళై రాఘవాచార్య

## హోటల్ పాట

అంకెల ప్రకారం ఇంకా ఉదయం కాకముందే
ఇరాని హోటల్ పాట మొదలై
రోడ్ల పైని నిశ్శబ్దాన్ని ఊడ్చేసింది–
ప్రక్కనే రైల్వే స్టేషన్ పాట విని
హుషారుగా కేకేసి
పాటకు హుషారునిచ్చింది!
హోటల్ పాటకు
రిక్షావాలా కాళ్లలోని రోడ్డు మేల్కొంది–
పాటకు బోరింగ్ నీళ్లు పైకి పారి
రిక్షావాల ముఖంమీది నిద్రను
నిద్రలోని సోమరి జనంకు ఇచ్చేసింది
హోటల్ పాట రిక్షావాలకు ప్రభాత గీతిక!
హోటల్ పాట వింటూ
టేబుల్ తుడిచే వృద్ధుడు
తన ఎముక మూలుగులో ముడుచుకున్న మనస్సును
పాట మలుపు మలుపులోని భావంతో
వెచ్చజేస్తున్నాడు యౌవన జ్ఞాపకాలుగా!
మూసుకున్న కిటికీలా
దుప్పటి కప్పుకుని పడుకునే వాణ్ణి
ఇప్పుడు హోటల్ పాటకోసం
చలిని దుప్పట్లో మడతలు చేసి
రోడ్డు నిద్రను భంగం చేస్తు నడిచిపోతున్నాను
సూర్యుడికి సైతం తప్పలేదు
నాలాగే హోటల్ పాట వినాలని
రోజుకన్నా ముందే ఉదయిస్తున్నాడు.

## ఆర్. సీతారామారావు

### దీక్షితులుగారి చేసంచి

సరిగ్గామూప్పైయో తారీఖున ఆయన
మొహానికి జీతంతో వెల్లవేసింది కాలం
అంతవరకూ నరాల్లో నెత్తుటి కణాలు
బాధని స్పృశించీ స్పృశించీ అలిసిపోయాయి
బంగాళాఖాతంలాంటి గుండె ఒక్కంత
శాంతించింది.
రెండు కళ్ళలో ఒకటి
అరేబియా రెండోది
పసిఫిక్ ఇవికాక కన్నీటి కాలువలు
క్షణాల్లో ఆవిరైన కరెన్సీ శ్రమ
అనంతానంత ఎడారులై పోయాయి.
నోట్లమీద బతుకు విగురించినట్లే అనిపించి
అమాంతం చెట్టు కూలిపోయింది.
నోట్లమీద బతుకు విగురించినట్లే అనిపించి
అమాంతం చెట్టు కూలిపోయింది.
సుదీర్ఘమైన ప్రపంచ ఆకలి సంవత్సరాల వెంట
దారిద్ర్య రేఖల మీద పడకుండా నడుస్తున్నవాడు
దీక్షితులు.
ఆయన కన్నీళ్ళలో తేలే శవమే చేసంచి.
చిలక్కొయ్యకు ఇరవై తొమ్మిది రోజులుగా
ఉరేయబడి ఉంది.
రెండో కూతురి తాళిని తన మూత్రపిండం
దానం చేసి చేయించాడు
విషాదం పురివిప్పి నెమలై ఆడి
కిరోసిన్ మంటల్లో మాడి పోయిందా చిట్టితల్లి
అరుగురి పేగుల్లో దిగిపోయి తుప్పు పట్టిన

ఆకలి కత్తుల్ని ఒక్కో చుక్క
రక్తం అమ్ముతూ పెంచుతున్నాడు.
వీటి రహస్యాలు ఒక్క వేసంచికే తెలుసు
రోడ్డుమీద మోచేతికి ఊగులాడ్తూ
కేరింతలు కొట్టలేదు వేసంచి
గొంతులో దుఃఖపు సమాధులు కట్టుకుంది.
ఒక్కోసారి
కన్నీటి జడి
ఒక్కసారే కాళ్ళకు నోట్లకట్టలు చుట్టుకున్నాయి
చేతులకు నిజాయితీ గొలుసులు కట్టుకున్నవాడు
కనుక.
వాటిని అంటుకోనైనా అంటుకోలేదు
వేలగంటలు
చౌక దుకాణాలముందు నిలబడీ నిలబడీ
కాళ్ళు చచ్చుబడ్డాయి వేసంచికి
అదిప్పుడు మనోవ్యాధితో
ఇంటి చూరులో కునుకు తీస్తోంది
సంచీడు రహస్యాల్ని దాచుకుని.
సూక్ష్మదర్శిని కింద ఆకలి నాణ్యతని
పరీక్షించి—
దీక్షితులు కుటుంబానికి
ఐ.ఎస్.ఐ. మార్కు ఇవ్వమంటుందా
వేసంచి అప్పుడప్పుడూ—!

"ఏమి రాత్రి!
దీపం వెలిగిస్తే కాంతి ఇవ్వడానికి
బదులు నిట్టూర్పు విడుస్తోంది
బహుశా ఇవాళ
ఆకాశపు ఆలోచనల్లో
చంద్రుడొక కన్నీటి చుక్క" —శేషేంద్ర

# అమ్మంగి వేణుగోపాల్

## నగ్నవాటకం

గడియారాల షాపులో టైమ్ తెలీడం లేదు
టైమ్ బాంబులు తప్ప అలారం మోగడం లేదు
చౌరస్తామీది విగ్రహం దగ్గరినుంచి
ప్రపంచశాంతి బహుమానందాకా
అన్నీ కల్పిత సత్యాలో నశేష అబద్ధాలో అయినప్పుడు
గాలి పీల్చి బతికే నిరుపేదకు ఆదర్శాలను ఎలా బోధిస్తావు
మతం ముట్టడిలో మహానగరం కన్నీటి జీవనదుల్ని కారుస్తుంటే
వెన్నెలలో మానవ పాదస్పర్శకు ఏమని గర్విస్తావు?
భూమాత కూడా అనాథలకు సవతితల్లే
పాత బస్తీ మట్టికూడా మనిషిరక్తం రుచి మరిగింది
సాలార్‌జంగ్ మ్యూజియం మరిన్ని ఖడ్గ సత్యాలను కడుపులో దాచుకుంటోంది
మక్కామసీదు పావురం కూడా కొత్తనగరంలో గూడు వెతుక్కుంటోంది
చార్మినార్ మత కాలుష్యంతో నల్లబడిపోతోంది
వధ్య శిలమీదే కొత్త శాసనాలు పదును దేరుతున్నప్పుడు
మతోన్మాదుల నాళాల్లో 'మూసీనదులు' ప్రవహిస్తున్నప్పుడు
పచ్చని ముంగిట్లో కర్ఫ్యూయిజం ఎడారుల్ని పరుస్తున్నప్పుడు
మూసిన తలుపుల్ని పులిపంజాలు బద్దలు కొడుతునప్పుడు
లోని ఆకలి మృగానికీ, బయటి కత్తుల దారికీ తేడా కనిపించదు
కాని, హత్యకూ ఆత్మహత్యకూ తేడా చిన్నదేం కాదు
అసలు హంతకుడెవడో అందరికీ తెలుసు
హంతకుడే న్యాయమూర్తి అయినప్పుడు
శిక్ష నిర్దోషికేనని కూడా అందరికీ తెలుసు
తెలిసి నడుస్తున్న నగ్న నాటకంలోకి
—ప్రేక్షకులు ప్రవేశిస్తేనే తెరపడుతుంది.

# ప్రసేన్

## అక్షయతూణీరం

నువు తప్పిపోయావట
అగ్నిపూల అంచుల్లోంచి జారే ఎరుపులో
ఆకాశం కార్చే కన్నీటి తారకల మెరుపులో
దాహంతో పిడచకట్టిన ధాత్రి గుండె బీటల లోతున
ఎండు చిగుర్లు మేసి కూసే కోకిల గొంతు
నులుముతున్న వసంత శిఖరావ
మెదడును పర్సుల్లో దాచుకొనే
మేధావుల సిల్కు చొక్కా జేబుల్లో
సినీతార చూపించక దాచేసిన అంగంలో
అఖల్ తక్త్ గోడల ఇటుకల నడుమ
రాజ్యాంగ పేజీలు తిని బలిసిన చెదపురుగుల
జీర్ణాశయాల్లో
ప్రపంచాన్ని కడుపులో దాచుకునే పెంటకుప్పల్లో
అంతటా వెదికాను
కాలానికి నేత్రాలను గుచ్చి గుడ్డి వెలుతురుకు చేతులనిచ్చి
నా అనుమానం–నువు చనిపోయావని
అన్నార్తుల కన్నీటి ప్రళయ ఘోష
వాంటెడ్ కాలమ్‌లో చిక్కిన కంటి విసుగు
రాత్రుల్ని వెలిగించే కన్నెల గుండెకోత
ఆకలి పేగుల భీకర సమర భేరి
నీ చెవి సోకితే–కదిలిరా
తూరుపు ఎరుపులోంచో
అడవిన కాసిన ఆయుధంగానో
గులాబిమాటు ముల్లురూపాన్నో
వేగుచుక్క వెలుగు మాదిరిగానో
నిరూపించు
నువు తప్పిపోలేదనీ చచ్చిపోలేదనీ.

# రాజేశ్వరి దివాకర్ల

## అజరామరం

నేస్తం
మన స్నేహం ఎప్పటిది
ఒక
చైత్రంలో కలిసాం
ఫాల్గుణంలో మైత్రిని పండించుకొన్నాం
కరవీరం
తొడిగిన
మొదటి మొగ్గలవలె
మనసులు నింపుకొన్నాం.
పసిడి ఆకుల
విందు రాశికి
పేరున్న వారసులం మనం.
పైరుగాలి
ఊయలెక్కి
సిందూరం
తాకిన మనం
పెదాలకు పులుముకొన్నాం.
మనం నడచిన దారులనిండా నవకుసుమ పరాగాలు
మనం శయనించిన పడకలనిండా నవచూత ప్రసవాలు
అశోక వృక్ష గుంఫనాల
ఆశలు రంగులు వేస్తున్న మనం
కబళించాలని
చూస్తున్న
డేగల గుంపును
విదళించడానికి
ఒకే ఒక్క పావురాన్ని ఎగరేసిన వాళ్ళం.

పంచాంగ గుణింతాలు
అరువదు లెన్ని వేర్చినా
చర్మాలకు
ముడుతలు రాని వాళ్ళం
మరొక క్రొత్త వసంతానికి
రూపు కడుతున్న అనంగులం మనం.
తారలు మలిగిన తరువాత
అరుణ రాగం
మొలిపించే
మనం
ఎప్పటికీ
నవప్రభవ
శిశువులం.

## కార్గోలో శవం

నా కళ్ళల్లో
ఉబ్బికొస్తున్న నీళ్ళు
గుండెలో శూన్యాన్ని నింపుతున్నప్పుడు
ఆకాశంలో
ఎగురుతున్న
రెక్కల చప్పుడు
నువ్వు తెరుచుకొని వెళ్ళిన
స్వర్గద్వారం ముందు
వదిలిన
చర్మాన్ని
ఎముకలను
మోసుకొస్తోంది.
నువ్వు లేని ఉనికి
నను ఉరితీస్తున్నప్పుడు
నా చుట్టూ జనం

నిశ్వాసాలు విడుస్తున్నారు.
నా ముందు
లోయల్లో
నా గొంతు వక్కటే
రోదిస్తూ ప్రతిధ్వనిస్తోంది.
ఈ విమానంలో
కీర్తి తురాయిని ధరించి
సన్మాన శాలువాలతో
దిగివచ్చే నువ్వు
నా గుండెలో
దిగగొట్టబడిన మేకుల
నల్లని పెట్టెలో
కార్గోలో శవమై
మోసుకొని రాబడినపుడు
వసంతం తిరిగిందొక గొప్ప మలుపు
ఆరిపోతూ సూర్యుడు
సంధ్యలో ధూళి రేపినపుడు
మరల
తొలకరి చినుకులు కురిసేదెప్పుడు.

"భూమి మీద వ్రేలుతోంది విషాదం
అదుగో ఆ సుదూరమేఘాల దూదిపింజల్లాగ
పసుపు పచ్చని ఆకులమీద నడుస్తూ
గాలినడిగి మనశ్శాంతి ఎరువు తెచ్చుకుంటాను
సరియైన దారి ఇదీ అని చెప్పలేను
నాచుమీదా ముళ్ళమీదా నడుస్తున్నాను
అగాధపు అంచున నిలుచున్నాను
ఓర్పుగా, ఎంచేతనంటే కాలం అనంతం...."

—అలెగ్జాండర్ ఫ్లెషిన్ (అను. శ్రీశ్రీ)

## నిఖిలేశ్వర్

### మళ్లీ అదే సూర్యుడు!

ఆ కొండల మాటున
తలబాదుకునే అస్తంగత సూర్యుడి తలలో
భగ్గున మండుతున్న ప్రశ్నలు.
రాళ్ల రప్పలు పొలాల మధ్య లేచిన
పొగగొట్టాల నీడల్లో పారిశ్రామిక వాడ
ఇక్కడ కనీసం అగ్గిపెట్టెలు ఆవాసాలు
లేదా సిగరేట్ పెట్టెల్లాంటి జనావాసాల్లో
జానెడు బారెడు గుడిసెల్లో
మనందరి సంపద సృష్టించే వాళ్ల మనుగడ.

ఈ మనుగడకొక అర్థం వెతుక్కునే తీరిక
వీళ్లకు మీరు ఇవ్వనే లేదు;
ఇస్తే ఎక్కడ ఎదురు తిరిగి
రాజ్యాధికారం చేజిక్కించుకుంటారో ననే
తీరని భయం మీకు!

మహానగరంలో కట్టుకున్న మీ రక్షణ కవచాల్లో
ఆకలి-కొరత–తీరని అవసరాలనే
ప్రసక్తి అసలు మీకు లేనే లేదు!
ఏదో పేరు మీద
సులభ వాయిదాలపై తరగని ఆస్తిని
సుస్థిరం చేసుకుంటే చాలు–
అదే పూర్వజన్మ సుకృతం లేదా
ఏదో అవతార పురుషుడి పూజాఫలంగా
దేవుడి దయవల్ల అన్ని అక్రమాలు
అందుబాటులోకి వచ్చిన అన్ని సౌకర్యాలు

ఈ వ్యవస్థ ఫలితమేనంటే
మతం నవ్వి వూరుకుంటుంది!
"ఎందరో మహానుభావుల" అధికారదండం
అంచెలవారిగా ఆడుతోంది.

ఇక్కడ సామాన్యుడికి లేదా
తలమాసినోడికి
ఎలాంటి రక్షణా ఎందుకు లేకుండా పోయిందని
నువ్వు అడిగినా నేను అడిగినా
సూటి సమాధానం మీవైపునుంచి రావడం లేదు.
—అవే కొండలమీద
భళ్లున తెల్లవారిన రక్తార్ణవంలో
మరింత భగ్గుమంటున్న స్వేదబిందువులు
నిరంతరం—
వెంటాడే ప్రశ్నల ఉదయాస్తమయాలు!!

"ఈ రేయి జీవితాల
చవిటి పర్రపై వెన్నెల కాస్తున్నది!
నిశ్శబ్దం కూస్తున్నది
గుండెమీది బరువులాగ,
నవనాడుల తీగెలూగ.
మంచు తగిలి ముడుచుకొన్న
పుష్పప్రేతముల పుప్పొడి
చమురు నిడుకొను బ్రతుకుల
దివ్వెల మలి జాముల కొడి
ఈ వెన్నెల!
మెలకువ నెరుగని కిన్నెర కన్నెల కల
నిద్రారుద్రస్థలిలో నిశ్శబ్దపు నవ్వుల జల
ఈ వెన్నెల, తెలివెన్నెల!" —బైరాగి

# పేర్వారం జగన్నాథం

## మిరియాలు

1

వాని తాత—
కనిపించిన వాడికల్లా
శఠకోపం పెట్టేవాడు
తండ్రి—
కుచ్చుటోపీ పెట్టి
కుర్చీకి సలాం చేసేవాడు
అబ్బో వీడా—
కని పెంచిన తల్లికే నిప్పంటించి
గాంధీకి టోపీ పెట్టినాడు

2

వాడికి—
ఆశించిన పదవి లభిస్తే
పంచరత్నాలు పండించేవాడు
కనీసం ప్రమోషనైనా ఇస్తే
ప్రభువుల పాదరక్షలపై
మహాకావ్యమల్లి చూపించేవాడు
పాపం....
ఇట్లా తగుల బెడుతున్నాడు

3

సూర్యుడస్తమిస్తుంటే
చుక్కలు నిక్కి చూస్తుంటాయి
ఛీ! వాటి కెన్నటికీ బుద్ధిరాదు
తెల్లవారితే కాని
వాటి తెలివి తెల్లారదు

# ఆర్. ఎస్. సుదర్శనం

## జ్ఞాపకాలు

ఆకసానికి వంపులు దిద్దే కొబ్బరాకుల్లా
నీ కనుబొమలు,
వాటి మధ్య రవిబింబంలా
కుంకుమ బొట్టు,
నన్ను నిలువునా తటిత్తులా
పులకింప జేసే నీ చూపు,
ఈ వానాకాలపు సంధ్యలో తీరని కోరికవై
చలించి, రహించి, జ్వలించి
బూడిదను చేశావు నన్ను,
ఎక్కడికి మాయమయ్యావు నువ్వు?
మనుష్యుల సంతలో తప్పిపోయిన పసిపిల్లలా
కుట్రదారులు ఎత్తుకు పోయిన రాకుమారిలా
ఎంత వెదకినా కనిపించవు, లభించవు.
కోవెలలో గర్భాలయం ముందు
స్వామికి నమస్కరిస్తూ ముగ్ధంగా నిల్చి
ముకుళించిన నీ నేత్రాలు-
హారతి వెలుగులో వికసించి
విచ్చుకున్న పద్మపత్రాల్లా నీ అరచేతులు
వెలుతుర్ని కళ్ళకద్దుకున్న క్షణంలో—
గుర్తించి, గుండె గొంతుకలోకి వచ్చి
అటువైపు తిరిగిన నిన్నిటువైపు
పిలిచి సమీపించే క్షణంలో
కల చెదిరిపోయింది!
ముసలితనం లేదు నీకూ నా మనస్సుకూ
ఆరతి కర్పూర కీలనై
నీ కళ్లనీ చేతుల్నీ
తాకుతూనే ఉంటాను!

## ఎ. శ్రావణ్‌కుమార్

### ప్రక్షాళన

స్టైరైల్ కంటెయినర్లో ఉడకేస్తా నా కళ్ళను
సెలైన్ బాటిల్లో ఉతికేస్తా నా చూపులను
అనునిత్యం ఆశతో—
రోగాల రంగుల్ని వీక్షిస్తూ
సుఖభోగాల్ని పరీక్షిస్తూ, పరిరక్షిస్తూ.
వ్యామోహపు వైభవాల తెల్లకోటు చాటున
మరకల్లా గడ్డిపరకల్లా నోట్లను దాచేస్తూ—
మకిలి ముఖాల్ని కన్నీటి చారికల్ని దగాచేస్తూ
చూపులను కంటి బీరువాల్లో
కూల్ బీరంత భద్రంగా
మత్తుగా—గమ్మత్తుగా....
గడియారం కేసి చూస్తా—
వ్యాపారం వ్యవహారమంత దీక్షగా-పరీక్షగా!
ఎవడి కాలమైనా రెక్కలొచ్చి
నా చేతుల్లోంచి ఎగిరిపోతే
శూన్యంలోకి చూస్తున్నట్టు విచారిస్తున్నట్టు
ఇగిరిపోయే ఈథర్ కన్నీటి బొట్లు రాల్చి
గారడీ చేస్తా—పెదవి విరిచి
"ఓ గాడ్! సేవ్ హిజ్ (హర్) సోల్"
అనరుస్తా—అనునయిస్తా—అభినయిస్తా!
మళ్ళీ మరో నాడు అదే చేస్తాను
ఈ రొటీన్ మెకానిజాల మధ్య
నిజంగా విశ్రాంతి దొరికితే
మానసారణ్యంలో జ్ఞానోదయమే!
అప్పుడు-
కళ్ళను, జబ్బులను, చూపుల్ని

నా కంటి పాపల్తో సహా ఊడ బెరికి
ఉడకేస్తా—ఉతికేస్తా
మోసం మోహం వెలిసిపోయేంత తెల్లగా!

## దారిలేవి పావురాలు!

బాబూ ఈ పావురాలను
ఏ అడవిలో నైనా వదలిరా నాయనా అంటోందమ్మ!
ఇంత కాలం తాను కంటి ఘటాల్లో వుంచి
నోటి దగ్గరి ముద్దల్ని పంచి
భద్రంగా దాచి వాటిని పెంచింది.
ఈ రోజులు మొలకెత్తని విత్తనాలు బాబూ
ఎన్ని కన్నీళ్ళెన్ని ఆశలు పోసినా లాభం లేదు!
ఎవర్ని యాచించినా పిడికెడు కడుపు
మోపెడు ఆకలి పేగులు—
మూసిన కను తలుపుల మధ్య మృగాలోచనలు....
అమ్మా అవి శాంతి కపోతాలే! అంటే—అవును బాబూ—
అవి ఆకలి జ్వాలల్లో మండిపోతాయ్
కొందరి చూపుల తూటాలకు నేలకొరుగుతాయ్
నిన్నటి దాకా గుడిగోపురాల మీద
గురుద్వారాల మీదా స్వేచ్ఛా విహారాలు చేశాయ్
ఈ రోజు వాటి తెల్లటి రెక్కలమీద
నెత్తుటి గోళాలు మోస్తున్నాయ్
వాటాలకోసం ప్రత్యేక కోటాలకోసం
తన్ను కుంటున్న నీ అన్నదమ్ములకు పంపిన
శాంతి సందేశాలు....
బాయ్‌నెట్ చివర్ల వేలాడి గాలిలో కలిసాయ్!
కాలం బాగాలేదు వెళ్ళు బాబూ
వెలుగుదక్కని అడవికి శాంతైనా దక్కనీ-అంటోంది.
పిచ్చి తల్లికి తెలీదు—
అడవులెప్పుడో నగరాల్లో కలిసాయని!
కలిసిన్నాడే నాగరికతలో కన్నుమూసాయని!
ఇప్పుడివి దారి లేని పావురాలని!

# తంగిరాల సుబ్బారావు

## నడచి వచ్చిన దారి
(క్రిందటి సంచిక తరువాయి)

### 11

అది
అడవిలాంటి
పాతిక కొంపల చిన్నపల్లె.
మాది ఒక్కటే బ్రాహ్మణ కుటుంబం
ఎదురుగా
మీసాలు లేని (గోపాల) రాజుగారు
కాస్త నేల పట్టున్న గౌరవనీయుడైన క్షత్రియుడు
గాంధీగారి కొల్లాయి ఖద్దరు శిష్యుడు
తన నియమ బద్ధ జీవితంలో
మా లేత మనసుల మీద
బలంగా ముద్దర వేసిన ముఖ్యుడు.
తక్కిన వాళ్లందరూ బీదరాజులూ బిక్కకాపులూ
రెక్కాడి తేకాని డొక్కాడని వ్యవసాయ కూలీలు
అక్కడ మేము
ఏ దిక్కూలేని 'బ్యామ్మర్లం'
ఎలా బ్రతికి బట్టకట్టామో
ఇప్పుడు తలచుకుంటే—
భయంతో ఎముకలు వణుకుతాయి
ఏదో పీడ కలలోంచి
మెలకువ వచ్చినంత సంతోషం
తొణుకుతుంది!

### 12

గృహవైద్యంతో
గవ్వాకు పువ్వాకు పసరులతో
చిక్క శల్యమైన చిన్ని తమ్ముడు జగన్నాథం.

కన్నులలో మిలమిల మెరిసే ప్రాణం
మెడలో దండలనిండా బరువైన తాయెత్తులు
ఉత్తరంగా నాలుగు మైళ్ల మట్టిరోడ్డుమీద
బాలవీరుడు పదేళ్ల అన్నయ్య బాడీగార్డుగా నడవగా
అమ్మ 'తణుకు' వెళ్లి చేయించిన అల్లోపతీ వైద్యం వ్యర్థం
డాక్టరు రంగునీళ్ల శూన్యఫలితం
అద్దు పేపరుగాడు కాంపౌండర్
బల్లక్రింద చేతులు పదేపదే కదలిక.
పేదల పాలిటి కల్పవృక్షం హోమియోపతి
దక్షిణంగా మూడు మైళ్ల నడిచి వెళ్లి
'ఇరగవరం'లో అమ్మ ఆశ్రయించిన దూరపు బంధువు
క్యాటలాగు వైద్యం
మిడిమిడి జ్ఞానం
కొంప ముంచింది
అమ్మ ఆశల్ని హరించింది
ప్రమిదలోని చిరుదీపం
కొండెక్కింది!

13

పొరుగూళ్లో జగన్నాథం చనిపోయాడు
అక్కడే జ్ఞాతుల చేతిమీద మట్టిలో మట్టై
అర్ధరాత్రి నిశ్శబ్దాన్ని కప్పుకుని
అమ్మ ఒంటరిగా వచ్చింది
గుండెలు పగిలేలా భోరున ఏడ్చింది
పొంగిన దుఃఖ సముద్రంలో
అక్కయ్యలిద్దరు, అన్నదమ్ములు నలుగురు
అంతా చీకటి
తెల్లగా బొద్దుగా గిరజాల జుట్టుతో
పెదవుల మీద నవ్వుల పారిజాతాలు పూయించే
అంత అందమైన వాడు
ఎక్కడికి వెళ్ళిపోయాడు?
మరణం ఎంత అయోమయం!
ఎంత దుర్భరం!

నా గుండెల్లో
అప్పుడప్పుడు
కలుక్కుమనే ఆ కంటకం
పంచ పాండవులం కావలసింది
రామ సోదరులమయ్యాం.

14

తాత దుర్మార్గం
నాన్న అమాయకత్వం
ఇరుగు పొరుగు పామరుల దౌర్జన్యం
అంతా అరణ్యన్యాయం
దీన్ని తట్టుకోలేక
అడవిలోంచి పట్నంలోకి ప్రవాసం
(నాల్గవ తరగతి వాచకంలో చదివిన
'అంతయు మన మేలునకే' పాఠం)
ప్రకృతిలోంచి ప్రాణాలున్న జనంలోకి
వింతలు వినోదాలు
నిత్యం తిరునాళ్లు
మనకు తెలియని ఎంత ప్రపంచం ఉంది!
రక్తంలో రహస్యంగా గుబాళించే
తాత ముత్తాతల వేదఘోష
విజ్ఞానపు వాడి కత్తుల తళత్తళ
చదువు సంధ్యల పట్టుదల
ఫస్టు మార్కుల ఉత్సాహం
నిత్యం గోస్తనదీ స్నానం
ప్రవాహం వడిలో ఎదురీత
ఎంత బావుంది ఈ జీవితం!!

15

విశాలమైన ప్రకృతిలోంచి
ఇరుకు కొంపలలోకి-
గడ్డ కట్టిన గేదె పెరుగులోంచి
కటికి నీళ్ల మజ్జిగలోకి-
స్వేచ్ఛలోంచి బానిసత్వంలోకి-

స్వచ్ఛమైన మనస్సులలోంచి
సంకుచితమైన ఈర్ష్యలలోకి-
సహజత్వంలోంచి కృత్రిమత్వంలోకి–
వాస్తవికతలోంచి కపట నాటకంలోకి–
సంపదనుంచి దారిద్ర్యంలోకి–
పల్లెనుంచి పట్నంలోకి
అయినా
ఇదంతా
రాబోయే ధర్మజుని సశరీర స్వర్గానికి
క్షణకాల నరక దర్శనం కాబోలు
బాగా ఆలోచిస్తే—
అజ్ఞానం వరదలో కొట్టుకు పోతున్న పసివాళ్లం
విజ్ఞానం ఒడ్డుకు చేరాం....

16

గిరగిర తిరుగుతున్న కాలచక్రపుటిరుసులలోంచి
మొలకెత్తిన ఆరంభ యౌవనం
ఏదో తెలియని ఆవేదన
పిచ్చి ఆకలి
ఆడగాలి సోకితే చాలు
అష్టావక్రుడిగా మారే మనస్సు
'యువతీ యువకులు'
ఎంత అందమైన సృష్టి ఆ పరమేష్టిది
ప్రేమ-మోహం-విరహం-ఆకర్షణ
ఎంత అద్భుతమైన భావన
ఎంత బలమైన కామన
ఇంతలో
కొవ్వూరు మామయ్య కూతురు
పధ్నాలు గేళ్ల ముద్దబంతి పువ్వు మెడలో
పంధొమ్మిదేళ్ల నేను వేసిన మూడు ముళ్లు
టీనేజ్ తియ్యని మూగబాధ
ఈ జీవన వనజంలో
ఎంత మకరందం దాగి ఉంది

ఆమె నేనూ
యుగాలు క్షణాలుగా
పరుగు....

17

చదువుకు సైంధవుడిలా
అడ్డుపడ్డ పేదరికం
ఆశల గుర్రాలకు కళ్లెం
చిన్న ఉద్యోగం
చాలీ చాలని జీతం
పిల్లల గోల
సంసారం కాదు సుమా హేల
సాగరం కష్టాల కెరటాలతో కొట్టేవేల

18

చేతకాని వాడికి జాతకం
పట్టుబట్టల వర్తకుడు చెప్పిన
బంగరు భవిష్యత్తు
ఉన్నట్టుండి తెగింపు
గుమాస్తా ఉద్యోగానికి రాజీనామా
పట్టుదల ఇనుప కచ్చడం కట్టుకుని
తిరుపతి నామాల దేవుని పాదాలముందు
తొమ్మిదేళ్లు
పెద్ద చదువు
పరిశోధన
అప్పుడప్పుడు కచ్చడం పట్టువదలి
కోర్కెల గుర్రాల పిచ్చి పరుగు
మళ్ళీ కష్టపడి బిగించిన కళ్లెం
జానపదుల వేటలో దేశాటనం
ఏదో చెప్పలేని తృప్తి
క్రొత్త విషయాలు బయటపెట్టి
గొప్ప డిగ్రీ సంపాదన
ఆనంద శిఖరారోహణ
అయినా నిరుద్యోగ పర్వం

తండ్రి మరణం
నింగి కూలిపోయింది
నేలతల్లి మిగిలింది
ఆశతో దశదిశలూ పరికించే
గ్రద్ధ చూపు
దేశంకాని దేశంలో అవకాశం
జీవితానికి స్థిరత్వం వచ్చింది చూడు
పశువుకు మెయ్యడానికి పెద్ద పచ్చిక బీడు!!

19

పిల్లా జెల్లంతో
తిరుపతినుండి
బెంగుళూరుకు—
మండుటెండలోంచి
మర్రి చెట్టునీడలోకి
చింకి చాపమీదనుంచి
పట్టెమంచం పట్టుపరుపుమీదికి
కటికి నీళ్లలోంచి
కమ్మటి పాలలోకి
గతుకుల డొంకదారినుంచి
మెత్తని పూల నెత్తావుల బాటలోకి
ఇరుకు మురికి సందులలోంచి
సువిశాల ఘంటా పథంలోకి-
కూపస్థ మండూకం ఉన్నట్లుండి
పాలపిట్టగా మారి
బుల్లి రెక్కలు చాచి
మెల్లగా ఆకాశం నీలిమలోకి ప్రాకి
జానపద గండభేరుండ పక్షిగా
శ్రీగంధ తరువుల మీది దివ్య పరిమళాల చిన్నిమబ్బుగా
రూపాంతరం

20

ఎన్ని పుంగనూరులు కలిసినా
ఒక బెంగళూరు కాదు.

ఎంత సుందరమైన నగరం!
ఇది నిజంగా నగరం కాదు
మహేంద్రుని నందనవనం!
ఎక్కడ చూసినా రంగురంగుల పూల బాసలు
రకరకాల పండ్లవాసనలు
అందమైన అంగనలు
చల్లనిగాలి ఈల పాటలు
నీలగిరి తరువుల తలపంకింపులు
కొబ్బరి చెట్ల వింజామరలు
వేడివేడి వేరుసెనగ కాయల ఆవిరిరుచుల గరగరలు
పచ్చికారం రాసిన దోసకాయ ముక్కల పరపరలు
పసుపు పూసుకున్న అనాసముక్కల ఘుమఘుమలు
ఆంజనేయుడిలా గుండెలు చీల్చుకుని
రువిరాభిరాముని ప్రదర్శించే
ఎర్ర జామిపండ్లు, దానిమ్మలు
బహు భాషల సినీమా బొమ్మలు
కస్తూరి మనసుల కన్నడ మనుషులు
ఎన్నడూ చూడని వింతలోకాల ధ్యానమఠం
పి.వి.యన్. చేతి చలవతో వెలసిన ఆంధ్రభారతీ పీఠం
కన్నడ రాయని కోటలో వేసిన తెలుగు పాగా!
కాలం
కొవ్వొత్తిలా కాలి
మంచుముక్కలా కరిగి
హారతి కర్పూరంలా
హరించుకుపోయిన
ఒక దశకం........ (సశేషం)

## కె. గోదావరి శర్మ

### బండ

ఎండకీ వానకీ ఎక్స్‌పోజ్ అయి
బండబారి పోయింది.
సున్నితమైన దాని స్నిగ్ధకపోలం
వన్నె తగ్గి దగ్ధకపాలంలా
తెల్లబడి వెల్లబడిపోయింది.
చిరుగాలికో చిరునవ్వుకో
చిగురుటాకులా ప్రకంపించిన
దాని అధరం ముదిరి, ప్రిదిలి,
చెట్టు బెరడులా గట్టిపడింది.
చంద్రముఖి సందర్శనంతో
తారల్లా మెరిసిన నయన తారలు
కలర్ బ్లైండ్‌నెస్‌తో గుడ్డిగవ్వల్లా
కలలూ కదలికలూ కోల్పోయాయి.
కాని,
సంకల్ప బలశాలి ఎవరైనా
బండని కొంచెం కదిపి చూస్తే
చెమ్మని కాపాడుకుంటూ
కమ్మని స్మృతుల్ని దాచుకుంటూ
దాని అంతరంగం అగుపిస్తుంది.
అంతే కాదు, అగుపడని లోతుల్లో
ఎప్పటికీ ఎండిపోని
జల కూడా నెలకొని ఉండవచ్చు.
ఆ బండ
అతడి గుండె.
శిలక్రింద జల
గుప్త ప్రేమ గలగల... ....

# వాయని కృష్ణకుమారి

## నా దేశం మఱ్ఱిచెట్టు

మూడు సముద్రాలు
ముప్పిరిగొన్న చోట
ముక్కంటి వలకేలి
ముమ్మొన వాలు
చొరబారిన రీతి
వేళ్ళు దన్నిన
సతత హరిత
జీవభరిత
చేతనావర్త ప్రతీక
మఱ్ఱి చెట్టు నా దేశం!

నా దేశం కొమ్మల్లో
నాలుగు దిక్కులూ విశ్రాంతి నలదుకొన్న వేళ
దిగంతాయాత సంస్కృతిచ్ఛాయ
నా దేశం రెమ్మల మాటున
విహంగ సంతానమై
విభిన్నకులాయ నిర్మాణ పరాయణమై
విలసిల్లిన వేళ
ప్రతిపక్ష కలారవంలో
పిక్కటిల్లిన ఋగ్గానం.
వేళ్ళు విస్తరించి
కొమ్మలు గుస్తరించి
చిగురు చిగురునా
చిలిపిగా తొంగి చూచే
జీవన ప్రాదుర్భావం

ఆకులు పరమకుని
రేకులు కలకలావిరిసి
ఆశ్రితానంత జీవ రాశిని
అసూర్యం పశ్యల్ని చేసే
అమేయ మార్దవ చర్య.

నా దేశం చెట్టు చాచిన చేతుల్లో
ఇవతళించిన మానవత్వం
ఈ చెట్టు పరచిన నీడ లోపల
సేద తీరిన విశ్వభావన!
ఎప్పటి మాటలివన్నీ
ఏనాటి జ్ఞాపికలివి!
కాలం కలిసి వచ్చిన వేళ
కనిపించినదంతా కమ్మని కల
కలిసిరాని విషమ ఘడియలో
కరకు నిజాలు కనుల యెదుట నిలచి
కదలికల్ని చంపే వికృష్టపు వల!

కాలం చేసిన గారడిలో
ఎన్నెన్ని అపహాస్యపు విశేషాలు
కాలం విప్పిన కవిలె కట్టలో
ఎన్నెన్ని యాతనామయ ప్రపంచాలు.

ఇంత పెద్దదేశం చెట్టును
అంతు తెలియని తెగులు చుట్టుకుని
ముక్కూ ముక్కూ రాచుకుంటూ
రెక్కలు గుచ్చి దువ్వుకుంటూ
కుశల ప్రశ్నలతో
కులాసాగా బ్రతికే పిట్టల గుంపులు
కొమ్మకొకటిగా
ఎడమొగం పెడమొగంగా
కాకిగోల కోకిలకు వద్దు

పికిలి కూతలు చిలకలకు కటువు
ఏ కొమ్మ పిట్ట ఆ కొమ్మనే చేరి
ఏ గూటి చిలుక ఆ పలుకునే పలుకు.
మనసులు మాటాడుకునే
ఊసులు లేనప్పుడు
ధ్యాసంతా గొంతు పలికే
రణగొణ ధ్వనుల మీదే!

మనసుల్ని పెంచాలనే
తాతపిట్ట తాపత్రయం చూచి
మొరటు వేటగాడి తుపాకి గొట్టం
అరచి తూటాలతో తాతను పడగొట్టింది.
ఏ కొమ్మ పిట్టకు
ఆ కొమ్మే కాదనీ
ఈ దేశం చెట్టున
అన్ని కొమ్మలూ
అందరివీననీ
తల్లిపిట్ట తల్లడిల్లితే
తిరిగీ
మొరటు వేటగాడి తుపాకి గొట్టం
అరచి తూటాలతో తల్లిని పడగొట్టింది.
చెట్టుకెంత కోపం
తన చేతుల్లో ఒదిగి
తన వేళ్ళమీద ఉయ్యాలలూగి
తన జీవద్రవ్యాన్ని పీల్చి పెరిగి
తన రొమ్ము గుద్దుతున్న
ఈ పిట్టల మీద
నా దేశం చెట్టుకెంత కోపం!

చకచకా ఎదిగింది దేశం చెట్టు
హిమావృత పర్వత పంక్తిని కప్పే
అగ్రశాఖా వింజామరం విప్పుతూ

జలాంతర్గత భూమిని ఢట్టించి
పాదాల దృఢత్వాన్ని పెంచింది
తూర్పు పడమరల ఊడల్ని పెంచి
ఊత కంబాలను నాటింది.

పిచ్చి పిట్టల్లార
పికిలి పిట్టల్లార
మీరంతా నావాళ్ళు
మీరు కాదురా
మీ తల్లో జేజెమ్మగా
ప్రళయ ఝంఝూ మరుద్విజృంభణ సాగనీ
ఈ చెట్టు కదలదు
ఏ చెట్టుకూ తల ఒగ్గదు
మీరు నా ప్రాణం
మీరే నా గుండెల మీద
ఆడుకునే పిచ్చిక పిట్టలు
పికిలి పిట్టలు
మిమ్మల్ని చెదరనీయను
శాఖా పుత్ర వాదం
మీ పట్ల చెల్లనీయను
మీరంతా ఒక్కటే.

నా దేశం మర్రిచెట్టు
జడలు విరబోసుకున్న
మహా మాతృరూపిణియై
కహకహా నవ్వుతోంది
సందిట బంధించిన
సంతాన బలాన్ని
సంతోషంతో తిలకిస్తూ
సర్వజగత్తుకూ
తిలకాయమానంగా
కలకలా వెలుగుతోంది
నా దేశం మర్రిచెట్టు.

# అఫ్సర్

## కెమిలియన్

కోట్లకే కాదు వాడు
ఓట్లకు పడగెత్తినవాడు
రాజ్యాంగం గోడలను
శుభ్రంగా పడగొట్టిన వాడు.
మనుషుల్నే కాదు
దేశాన్నీ కాలాన్నీ బాపలా చుట్టి
చంకన పెట్టుకున్నవాడు
తనకోసం ఇతరుల
రక్తాన్ని పణంగా అర్పించిన వాడు
చరిత్ర రూపు రేఖలను
తలకిందులు చేసినవాడు
అధికారానికి
అహంకారానికి దత్తపుత్రుడు.

తలచుకుంటే వాడు
సూర్యచంద్రుల్ని కూడా తాకట్టుపెట్టి
ఆకాశం మీది వెర్రి చుక్కలతో
నీ గాలిమేడలను సింగారిస్తాడు
నిన్ను భయం గుడారాల్లో దాచి
నీ మీనమేషాలు లెక్కపెట్టి
నుదుటిరాతనే శాసిస్తాడు.
వాగ్దానాల పల్లకీ ఎక్కి
ఊహలపై దాడి చేస్తాడు.
భువనభోంతరాళాలకు పసుపు శాలువా కప్పి
క్షణంలో
పిడికిట బంధిస్తాడు.
వాడికి

హిట్లర్ మీసం లేక పోవచ్చు.
ఖొమైనీ గడ్డం లేక పోవచ్చు.
ఇడీ అమీన్ పోలిక లేక పోవచ్చు.
కాని
మందహాసాలొలికించే
వాడి పెదవినిండా విషం.
మాట మాటలో
ప్రతి కదలికలో
ఒక హిట్లర్ ఒక ఖొమైనీ
ఒక ఇడీ అమీన్.

వాడు
పడగెత్తిన విషసర్పం.
కమ్ముకునే విషవాయువు.
విద్వేషాల విస్తరిలో
నెత్తురు పీల్చుకునే హంతకుడు.
ప్రతీకార జ్వాలల్లో
మాడ్చి మసిజేసే క్రూరుడు.
రంగు వేరైనా
రూపం ఒక్కటే
దేశం వేరైనా
మనిషి ఒక్కడే.

సముద్రంలా గంభీరంగా వచ్చి
ఉప్పెనలా బీభత్సం సృష్టించి
ఒక వల్లకాడూ
వెయ్యి శవాలూ
కూలిన కలలగూళ్ళూ వదిలి
వెళ్ళి పోతాడు వాడి మాయా జగత్తులోకి—
ప్రశ్నించలేని నువ్వు
సందేహించలేని నువ్వు
వాడికి ఆయుధంగా మారుతున్నావు.

నీ అమాయకమైన కళ్ళు
వాడి చేతుల్లో విచ్చుకత్తులు.
అశాంతిలో నలుగుతున్న నీ చేతులు
వాడికోసం మాడి పోయే కాగడాలు.
దేన్నీ ప్రశ్నించలేని నువ్వు
అన్నీ భరించే నువ్వు
దేన్నీ సందేహించలేని నువ్వు
అన్నీ సహించే నువ్వు
వాడి నీడవి!
వాడి ఆయుధానివి!

"ఇన్నేళ్ళ సాహచర్య ధమని,
లోపల ఎందుకు తెగిందో ఎవరికీ తెలీదు
ఇంత పెద్ద నెత్తురు ముద్దై కాలం
ఎర్రగా నన్నెందుకు చూస్తుందో తెలీదు!
వేసిన తాళం గదికి వేసినట్లే వుంది
తాళం చెవి, పెట్టిన చోట డాక్టరు బొడ్లోనే వుంది
ఎర్రటి నెత్తుటి రెక్కలు తపతపా కొట్టుకుంటూ
ఎగిరే పోయింది హంస
అప్పడే నే చూశాను కళ్ళారా
ఆకాశంలో వేస్తున్న మబ్బుదిబ్బల చితి మంటలు
ఆ వేడి భరించలేక
చెల్లా చెదరై విడిపోయిన పక్షుల జంటలు
అప్పుడు నేను విన్నాను
హంస పాడిన చివరి పాట
నేల మీద చితి పేర్చిన కాటికాపరి నోట"

—కుందుర్తి

## ఇంద్రాణి

### నిశాగీతి

చీకటి రోగంతో మూలిగే రాత్రి
వెన్నెల మాత్ర మింగి
జీవితాన్ని తెల్లవారుస్తోంది-
రాత్రి ఒడిలో దృశ్యశకలాలు
ఇరానీ కప్పుల్లో గంటల ముల్లుకు శిలువేసుకున్న
మాటల ముక్కలు
కౌగిలిలో ఇన్‌సోమ్నియా కలలుకనే ఘూర్కా
నెల కష్టాన్ని మంగళ సూత్రాన్ని మింగి మెరుస్తున్న ఆసుముక్క
సగటు దంపతుల్లా ఆ వివర్ణ కలుసుకున్న వీధిదీపాలు
ఖాకీ వనంలో తులసిమొక్క, మానంలో దిగిన లాఠీ
రాత్రొక అధివాస్తవిక కవితా సంకలనం-
చలిజ్వరపు వాయులీనంలా తలక్మహ్మద్
కోకిల వేణువూదినట్లు సుబ్బలక్ష్మి
కాంగో మృదంగంలా జాక్సన్
కచేరీ చేస్తున్న విభావరీ వాయువులు-
సుఖపు అంచున అతడి మూలుగు
ఆకలి కేకల పాప ఏడుపు
విజ్ఞాన సర్వస్వం బట్టీయం పెడ్తున్న నిరుద్యోగి
రాత్రొక వింత సంగీత విభావరి
విశ్శబ్ద రవళీ మాధురి
అడవి ఆయుధం అసెంబ్లి రంకు
ప్రేమికుల పరిష్వంగం కాముకుల కౌగిలింత
అందరినీ అన్నింటినీ ఒకేలా పలకరిస్తుంది
దీపాల గునపాలను గుండెల్లో దింపుకుని
కాంతి రుధిర తిలకాన్ని లోకంనుదుట దిద్ది
ఎదలో విషాదాన్ని నింపుకుని
ప్రపంచపు రెండవ వైపుకు వెళ్ళిపోతుంది-
పిచ్చిరాత్రి—

## కె. మురళి

### ప్లాస్టికు పద్యాలు

ఫ్లవరు వాజుల్లో బ్రహ్మజెముడు ముళ్లు
ప్రచారం మోజుల్లో బ్రాహ్మీమయము సుళ్లు
వీడియో జాడీల్లో
నాగ్నటిక్ ఊర్వశులు
డిస్పోజబుల్ ప్రేయసులు
మారివానా ధూమంలో మరువం పరువం
మైరేయద్రావకంలో దవనం కవనం
చనుబాలలో డీడీటీ
కనుపాపలో ఎల్లెస్డీ
కోరికల ఉష్ణగృహంలో
సెల్యులాయిడు కాచిన యాపిలు
మోహం మయసభలో
శాంప్సన్ కూర్చిన సరదా
ఎడారి బిడారులో రసాభాసవిభావరి
యెంకి ముక్కుకి ప్లాస్టికు ఫోర్జరీ
వంక జాబిల్లికి బూర్జువా తర్జుమా
మన వాళ్ల గుండెలు
సింథటికు ఫైబరు
చచ్చినా సత్య
సంధశను సైచరు.
జీవితమొక రావణకాష్ఠం
కవిత్వమొక గార్దభగోష్ఠం
యాంత్రికం ఆంతర్యంలో
అంతఃకరణం
అమావాస్య చీకట్లో
ఆరుద్ర అనంత
కుండలీకరణం.

## ఎస్జీడి చంద్రశేఖర్

### రణగొణ ధ్వనులు

గతుకులు గతుకులు
స్పీడ్ బ్రేకర్లు
బస్సు బ్రేకులు ఫెయిలయినట్టుండాయ్
స్టీరింగ్ ఊడొచ్చింది

చావు తప్పదురా బాబూ
దూకేయండి దూకేయండి
అద్దాలు పగలగొట్టండి
కాస్తంతలో తప్పిపోయింది
డ్రైవర్ చాకచక్యం
ఏడుకొండలవాడి దయ
అల్లా దయ
క్రీస్తు కరుణ

రైట్ రైట్
లెఫ్టకి కట్ చేసుకో
కాదు రైట్కి రైట్కి
అల్‌రైట్ పోపో....పో.

తొందర తొందర
జనం తొక్కిట్లో
ఎటు పోవాలో తెలీటం లేదు
ముందుకు వెనక్కు
కాదు కాదు ప్రక్కకు
వెధవ జనం వెధవ జనం
నేల ఈనినట్లు
కాదు కాదు ఆకాశం వర్షించినట్లు

# పి. ఎల్. శ్రీనివాస రెడ్డి

## తేడా

ఒకటి
ఎడసందులేని
బూతురాతల చేత ఖరాబైన గోడ
దాని మీద
ఎన్ని కందెన డబ్బాలు గుమ్మరిస్తేనేం?
ఇంకొకటి
స్వచ్ఛమైన వెన్నెల వెల్లువ చేత
వెల్లవేయబడింది
దీనిమీద చాలదా
ఒకే ఒక్క వానచుక్క
కొట్టవచ్చినట్టుగా కనబడడానికి

## అంతరం

నీటికి నిధి సముద్రం
అదంటే నాకు అసహ్యం
ఎందుకని?
మనిషి చస్తున్నా
గొంతు తడుపుకోవడానికీ
ఒక్క గుక్కెడు మంచి నీళ్లివ్వలేదు అందుకని
చెలమ
చిన్నదయినా నాకెంతో యిష్టం
ఎందుకని?
చెలిమికి ప్రతీక అది
పారజల్లిన కొద్దీ మంచినీటిని ఊరిస్తుంది
పాంథుల దప్పితీరుస్తుంది అందుకని.

# కీ. శే. దేవరకొండ బాలగంగాధర తిలక్

## త్రిశూలం

(ఇది విశాలాంధ్రవారు ప్రకటించిన 'అమృతం కురిసిన రాత్రి'లో చోటు చేసుకోలేక పోయిన మరోగేయం. కారణం స్పష్టమే. 1962 లో చైనా మన దేశం మీద దాడి చేసినప్పుడు తిలక్ దీనిని వ్రాసారు. ఆంధ్రప్రభ వారపత్రికలో ప్రకటించారు. తరువాత 1963 లో కీ. శే. వే. నరసింహా రెడ్డిగారు సంకలనం చేసిన 'సమరగీతి' అనే కవితా సంకలనంలో ఇది వచ్చింది. తిలక్‌ను పూర్తిగా అర్థం చేసుకుందుకు యువకవులకూ, పరిశోధకులకూ తోడ్పడుతుందనే ఉద్దేశంతో దీనిని ఇస్తున్నాను. దీనిని సేకరించి పంపిన ఆచార్య పేర్వారం జగన్నాథంగారికి కృతజ్ఞుడను— తంగిరాల)

నమ్మకు నవ్వలేని వాడిని, పువ్వులు చిదిమే వాడిని
బరిమీద వదలిన పాముని, చైనా వాడిని

సరిహద్దు మాత్రమే అయితే
సరిపెట్టుకోవచ్చు నొకలాగ
చిరకాలం కృషిచేసి మానవుడు
స్థిరంగా నిలుపుకున్న విలువల్ని
చెరపి వేస్తానంటే ఊరుకునేదెలాగ?
దేశానికి హద్దులూ ప్రవర్తనకి ఎల్లలూ
ఆవేశాలకు మితీ, కావేశాలకి పరిమితీ
అవసరం మానవ సౌఖ్యానికీ సఖ్యానికీ.

అందుకే అనాదిగా చరిత్రకి పునాదిగా
పొందు పరిచారు జాతికీ వ్యక్తికీ స్వతంత్రం
అందంగా అందర్నీ సమంగా వాడుకొమ్మన్నారు
అది కాదని వాదుకు సిద్ధమయితే
యుద్ధానికి కాలుదువ్వితే

ఊరుకునే చవట ఈ కాలంలో ఎవడు?
ఉరుకుతాడు ముందుకి సింహంలా నరుడు
చివ్వకు ప్రతి భారతీయుడూ ఒక కవ్వడి
గవ్వకు మారడు శత్రువు వాడెవడైనా

ఇకనుంచైనా వైనా బుద్ధిగా మెలగకపోతే
క్రకచం వంటి ప్రజాబలం కంఠాన్ని కోస్తుంది
సకల ప్రపంచం సంఘటితమై ఎదురిస్తుంది
మునుపటి వాళ్లం కాదు మునలివాళ్లం
మొనతేరిన బాకులమై మోహరించి నిలుస్తాం.

ప్రతి సోల్జర్ ఒక శతఘ్ని
ప్రతి పౌరుడొక దవాగ్ని
ప్రతిన బూని నిలబడు నిటారుగా
బ్రతుకెందుకు స్వతంత్రం పోవగా
ఇదే అదను పదను పెట్టు
పదే పదే యెద మొహదా
మన దేశం మన స్వప్నం
మరచిపోకు వెరచిరాకు
మనిషికి ఒకే సారి మరణం.

"నిమేషాల పిచ్చికేక
సమీపించనట్టి చోట
సఖీ! నీవు వచ్చుదాక
నిరీక్షిస్తు రాత్రి పూట
కార్చుచున్న కంటినీట
పోషింతును పూలతోట" —పఠాభి

## రామా చంద్రమౌళి

### జీవిత నిర్మాణం

కంటిరెప్పలు కలలకు, కన్నీళ్ళ సముద్రాలకు మింటి కప్పులు
గుండెల్లో నిద్రించే సింహాలనూ,
మండే అరణ్యాలనూ,
కన్నీళ్ళతో తడిచే పుష్పాలనూ,
జీవితాన్ని గర్జించే ఓ మౌనగీతం చేసుకుని పాడుతూ పోయే పాదాలనూ,
దోసిట్లో పూలకుప్పల్లా భరించే కళ్ళు
రెప్పల తెప్పలను కప్పుకుని ఓ క్షణం విశ్రమిస్తే....
ఎదపై ఓ ప్రపంచం వాలుతుంది భూమిపై సూర్యునిలా—
సందేహం లేదు
ఈ కన్నీళ్ళు నావే—నేను సృష్టించుకున్నవే,
ఈ సంతోషాలు, నవ్వులు నావే-నేను తెచ్చుకున్నవే
వీటి వెనుక ఉన్న శూన్యం మాత్రం
నేను నా కోసం మాత్రమే బ్రతుకుతున్నందువల్ల సంక్రమించింది.
నడుస్తూ ఉంటాను ఒంటరి వీధులగుండా
ఇసుక తీరాలపైనుండి
ఒక్క అడుగులో కోట్ల వేదనా స్మృతులను కోల్పోతూ,
వెంటాడ బడ్తుంటాను నేను
రా జీపడనిపోరాటాల్తో, లొంగిపోని యుద్ధాలతో
మృగంగా జీవింపజేసేందుకు ప్రయత్నించే సంఘంతో
నిరంతర ప్రతిఘటనతో—ఉద్భవించే తుఫానులతో
ఈ దుమారాన్ని నింపుకున్న హృదయాన్ని జోకొడ్తూ
పునరుద్యమింప జేసే కళ్ళు ఓ క్షణం రెప్పల రెక్కలను వాల్చి
ఓ మహోద్ధృత జీవశక్తిని
తోటపై వసంతంలా-ఈ రెండు చేతులపై వర్షిస్తాయి
బాహువులను ధరించిన ఆలోచనలు
మొలకలై, మొక్కలై... ఊడలై
జీవితాన్ని నిర్మిస్తాయి.... బ్రతుకును ప్రసాదిస్తూ.

# ఆర్వీయస్. సుందరం

## శునకోపాఖ్యానం

1

అలనాడు సూతుడు శౌనకాది మహామునులకు చెప్పిన కథ
జ్ఞాపకాల చిత్రశాలలో వేలాడుతూనే ఉంది
మరో తమాషా కథ చెప్పనా—

2

అన్ని కుక్కలూ విశ్వాసం కలవే
అయితే జాతికుక్కల కథే వేరు
వీధికుక్క
జానపదునిలాగే నిష్కపటి, ముక్కుకు సూటిగా పోయే రకం
మొరిగినా పైన బడి పీకినా అకృతకత మూర్తీభవించినట్లుంటుంది.
పెంపుడు కుక్క
ఎంత గొప్ప జాతిదైనా
మూతినాకుడు వ్యవహారమే
ఎప్పుడు గోకుతుందో నాకుతుందో పీకుతుందో తెలీదు
కుక్కలున్నాయి జాగ్రత్త బోర్డు కలవారికే చెల్లు

3

జానీ వీధికుక్క
ఏ గొందిలో పుట్టిందో ఏ సందులో పెరిగిందో
ఒకే ఒక రోజు
మిగిలిపోయిన సద్దెన్నం తిని తన
పొడుగుపాటి తోక ఆడించింది
ఆ నాటినుంచి ఈ నాటి వరకు
మాయింట్లో ఎవరిమీదైనా గుర్రుమనుంటే ఒట్టు
అయితే అందమంటారా—దానిదేముంది
సినిమా హీరో హీరోయిన్లలో అనాకారులెంతమంది లేరు!

జానీ దేహం మీద
దేశ సమస్యల్లాగే అక్కడక్కడా వ్రణాలు
ఓట్లు అడుక్కునే నాయకుల్లా
పురుగులు
నక్షత్రాలన్ని సమస్యల్ని ఒంటి మీద
కప్పుకుని
పిడికెడన్నం తిని నాలుగిళ్ళ వావడిని
కాపలాకాసే
యువర్స్ ఫెయిత్‌ఫుల్లీ శునకం
జానీ.

4

టీని పెంపుడు కుక్క
టీని టీని లిటిల్ చైల్డ్
క్రీమ్ కలర్ పామరేనియన్ జాతి శునకం
అబ్బో ఏమి అందం-ఏమి షోకు
దొంగచూపు చూచినా అందమే
లెక్కలేని బ్యాంకు బ్యాలన్సులూ కంపెనీ షేర్లూ
కలవారి కున్నట్లుగానే
లిటిల్ టీనీకి దేహంనిండా
నిగనిగ మెరిసే రోమాలు
(రోమహర్షునికీ రోమాలకూ సంబంధం లేదు!
శునకానికీ శౌనకునికి సంబంధం లేదు!)
ఎంత ప్రేమగా పెంచినా ఒక పూట ఫారెక్స్ పోయలేదని
వేలు కొరికేసింది టీని-బంగారు టీని-అందాల టీని.

5

జనమేజయుడు సత్రయాగం చేస్తుంటే
సారమేయుడనే శునకం చుట్టుపట్ల తిరిగిందని
దాన్ని కొట్టి పంపారు జనమేజయుని తమ్ములు
సరమ కోపంతో వచ్చి కేకలు వేసేసరికి
తోక ముడిచాడు జనమేజయుడు.
మొరిగే చోట మొరగాలి కరిచేచోట కరవాలి
మూతినాకుడు పనులు పనికిరావు-ఏమంటారు?

# తుమ్మపూడి కోటీశ్వరరావు

## వర్ణపింఛము

నీలలోహిత వర్ణమయము నిశ్చల బిందువునందు
హేలాచలదపాంగ తరళ మృదుకాంతి నృత్యముల్
లీలాతరంగాయమాణ లేఖాత్రికోణమయి
చాలిత సుందరీ భ్రమణ సంసారచక్రమ్ము తిరిగె. 1

జలనిధి కూర్ధ్వదేశమున సాగినదొక్క పసిండి తమ్మిపూ
దళములు విక్కనై విరిసి తార్కొని వెన్కకు వ్రాలి, నర్తకీ
లలిత మనోహరాంజలి విలాసముతో, నడిబొడ్డు స్వర్ణకాం
తులు చులుకాడ, మూలమెదో తోచని దీర్ఘభుజంగనాళమై 2

శూన్యరోదస్సు సుషుప్తిని వీడెనో
 స్ఫురణ కందును శబ్దమూర్తి యొకడు
అఖిలాంతరిక్షమ్మునందేదొ సుస్నిగ్ధ
 కాంచనాంబుజదళక్రమముతోచు
నలు మూలలందు సన్నని లేత వెల్గుల
 రేకలు వేణికారీతిసాగె
పచ్చపసుపు పొడి పైజల్లి నట్లుగా
 రాల్చుచున్నది అంబరమ్ము వెలుగు
పసుపు పొడి కాదు–కాదు ప్రవాహరీతి
పైడి తామర దిమ్మలో ప్రభలు కావు
ఒక జపాపుష్ప దివ్య కాంత్యుల్బణమ్ము
లేని జగమున్నయట్లు మొల్పించుచుండె. 3

లోఁగల చంద్రబింబపు వెలుంగుల కుచ్చులు శారద ప్రభన్
సాగెను తీగవంపులయి సారసముల్ వికసింప–సైకతక్ష్మా
భాగములన్ చరించె-యమునా నదియై తదభంగ భంగఝుం
పాగతులన్ తటస్థమగు వంశనికుంజపు హొయారుమ్రోతలై. 4

కొండసానులనుండి-కోనకై డిగు, దోర
మోరల కపిలగోపుంజమగుచు
గవినుండి ప్రాకుడు గడప ఖండలమీదు
గాజారు సెలయేటి కయ్యలగుచు
మధుర భావననుండి మహికవతరించెడు
పరిమాణ పర పద పంక్తియగుచు
ప్రావృడంభోద గర్భవ్రజోన్ముక్తముల్
జలతారు వానధారల విధాన
తరలి వచ్చిన బాల మార్తాండ మండ
లస్రవన్మ సృణాంశు మాలా విభూతి
వ్రజకులాంగణ ద్వారతోరణములందు
పచ్చకప్పురపున్ రంగవల్లులద్దె. 5

ఇంద్ర చాపమ్ము తునిగిన యట్లు మెఱసె
మౌళిపింఛము. అది వర్ణమాల సుడిసె
వర్ణములు మణిమాల ఎవ్వాని యెడద
మణులు గోవులు–గోపికల్-గుణమతండు. 6

స్వర్ణపద్మమ్ము; గోపతి కర్ణికమ్ము
నటిత గోపికాశత పత్రఘటిత పరిధి
కామ మురళి, గోవర్ధనాఖ్యమ్ము తమ్మి
కంపనములెల్ల నాట్య శృంగార రసము. 7

"నా హృదయ సీమలో నస్పృశ్యాశగర్భ
పథములంబడి యొరసి ప్రవాహమేచి
యూగి బుడగలు బుడగలై యుబికివచ్చి
నా కనుల తుట్టతుదలలో నాట్యమాడు" —విశ్వనాథ

# యస్వీ జోగారావు

## అపూర్వ కాకలి

ఏ యెలమావి కొమ్మ నెలుగెత్తినదో యొక కోయిలమ్మ ఆ
హాయనిపించె కుహుకుహు వా స్వర మశ్రుత పూర్వమైన నా
ప్యాయముగా పురాస్మృతి శుభాంతముగా రసరాగభోగ సం
ధాయకమై రహించె కవితాలలితా కలమంత్రహూతియై.

ఆ కూత సాకూతమై, నవ పల్లవ
మమతా సనాతనమైనవంన
పతదీయ మధురానుభవ మహీయః కుతూ
హలరతి కూజితమై. వనేంది
రావందన శ్లోకమై; వసంతాగమ
స్వాగత వాక్యమై, పట్టపగలు
గ్రుడ్లు గూటికి వచ్చు గూబకు మేలుకొ
లై్ప తనతోడను వంతపాడ

గొంతుసవరించు కొనుచున్న గువ్వపిట్ట
కూన రాగమ్ములకు కోరి కోయిలమ్మ
యొరవడించిన వరుసయై పరిణమించె
కోకిలము పిట్ట కొంచెము కూత ఘనము.

'ఆమని నోము' నోచె నఖిలార్తవ శోభలతో నరణ్యమా
రామముగా; వనావన పరాయణ కోయిల గోల పెట్టగా
మామిడి కంటుగట్టిరట మాలి యొకొక్కడె. అల్ల పల్లవ
శ్రీమహితాత్మ తత్ఫలరుచింభ్రమరించె రసజ్ఞ కోటికిన్

ఆ కవితాన్వయామర మహావని కామని నామతించు నా
నా కలకంఠశాబ నవనాయకుడై మధుపాక కాకలిన్
మ్రాకులు పల్లవింప రసరాజ్యములేలిన తేడు నేడహా!
వాకొన నేర డూకొనడు వాక్పతికేమి బెడంద వచ్చెనే!

కలికి పాటల కోయిల కొలము సామి
నేటికిటు మూగవోయిన నేమి వాని
గాత్ర గాంధర్వ సౌహార్ద గంధమెల్ల
పోసియుంచిన పాటల పొటలు గలవు

మూసలు ప్రాతలైనను అపూర్వ విధారసయోగ సిద్ధులా
పోసిన పోతలెల్ల నవి పోతలు గావు రసజ్ఞ చిత్తముల్
మోసులువారి మొగ్గతొడి పూచిన పూతలుగాని మూసినన్
వాసనలీను పోడుములు వాడని జాడయు దోచు వానికిన్.
(రాయప్రోలును దేవులపల్లిని అంతస్సన్నిధి చేసుకుంటే అంతరంగ మాలా
పించిన సంగీతమిది)

"నింగి విసరిన యొడిసెల రంగు బెడ్డ
బోలె వ్రాలెడు చక్కదనాల చుక్క,
అకులీనలు నా రాగ మాలకించి
వంశముల నిచ్చు దీర్ఘనిశ్వాస మదిగొ.

గగననికేతనమ్ము పయిగప్పిన తెల్లని పాలపెంకు ల
ట్లగపడు ధౌత మేఘశకలావళి జాడుము, కప్పు జీరువా
అగ దిగియున్న చీకటి తెరల్ పెడకేగెడు నింక జాములో
సుగుణవతీ! సుధాకిరణ సూత్రధరుండుదయించు నీ దెసన్"

—రాయప్రోలు

# డి. వి. కె. రాఘవాచార్యులు

## చిదంబరాష్టకము

శివకామేశ్వరి! నీ కటాక్ష కరుణా శీతాంశు రోచిస్సము
ద్భవ సౌందర్యము వెండికొండకు వినూత్నశ్రీ సమర్పింపగా
శివ నాట్యోత్సవ వేళ దుందుభులు మెలసెన్ దిగ్దిగంతంబులన్
భువి పెంజీకటి కావలన్ క్షితిజముల్ పుష్పించె జ్యోతిర్లతల్.

నీ కరుణోపలబ్ధి యవనీతలి నాట్యమయూర పింఛమై
యాకసమందు నింద్ర ధనురాకృతి దాల్చె చిదంబరేశ్వరా!
శ్రీకరమై మహోదయ పరిష్కృత మానస నేత్ర పర్వమై
చేకురె శాశ్వతీ సదన చేతనమో నటరాజశేఖరా!

ప్రణవపునర్నవోజ్జ్వల విభాత సువర్ణమయూఖ మేఖలా
గణిత మణి ప్రవాళ రుచిగంధ సమన్విత బిల్వమాలికా
ప్రణుత పదాంక చాలిత శుభప్రద ముద్రల నృత్యలాస్యచా
రణ రమణీయభావ రసరంజిత నేత్ర విభూతి వ్యక్తమౌ!

తల్లీ! వత్సలతన్ క్షమించు దురితాంధ స్వాంత విభ్రాంతు, గ
ర్వోల్లాస ప్రభ విష్ణు మోహమద సర్పోద్దగ్రదంష్ట్రా హతున్
కల్లోలాంతర సంతతాకులిత నిష్కర్మణ్య చేతస్కు, వా
గ్వల్లీ స్పందిత భావహీను నను సంస్కారచ్యుతన్ వర్జితున్.

భావావేశమునందు భాషయును, శబ్దాడంబరంబందు శి
ల్పావిష్కారము నష్టమొందునని సంభావించి నీ నాట్యమం
దే వాగర్థ సమన్వయంబు ప్రతిపాదింపంగ సృష్టిస్థితుల్
దేవా! నీ లయతాండవంబున రసోత్సేకంబు సంపన్నమౌ!

ఓంకారాకృతి-శక్తి శంకరుల సంయోగంబు సంపూర్ణమై
సంకేత స్థలియై చిదంబరము సాక్షాత్కారముంబూనె, ప్రే

మాంకంబై తగు నాది దంపతుల సర్వాంగీణ సంపత్తికిన్
కైంకర్యంబు నొనర్పగోరెదను దీక్షన్ జన్మజన్మంబులన్

సాకారుండొ సనాముడో శివుడు సృష్ట్యాదిన్ మలిన్ ధ్యాన చి
త్తాకాశ స్ఫటికాంతర స్థగిత నిత్యానంత పుంభావుడో!
ఏకాగ్రస్థిత శక్తిమండల విరూపేశాన నేత్ర త్రయీ
రాకేందు స్ఫురితాంశు దీప్త రజనీ రాజన్య సామ్రాజ్ఞియో!

అసురమస్తక శిఖరాగ్రమందొకపాద
మాకాశ సింధు పర్యంతమొకటి,
యొక చేయి హోమాగ్ని హోత్ర భాస్వంతమ్ము
డమరు కార్భాట విభ్రమిత మొకటి,
ఉత్పాత దిక్చక్ర మొక చేయి భీతావహ
మ్మొక్కట భయముద్రావలంబి,
భూర్భువస్స్వరవన పుంభావ మొక భాగ
మొకటి ప్రచోదన ప్రకృతికంబు,

కాల ఫూత్కార చలితాంశు కాంచలంబు
ప్రకృతి పురుషైకతా లాస్య భావుకంబు
భవ్య కైలాస సాయుజ్య పరమపదము
భవ–నవరస ప్రసన్న శోభావిభూతి!

"కాలపు బాటలంబడి యొకా
నొక తియ్యటివేళ కోమల
జ్వాలగ వచ్చి నా హృదయ
వారుతరాలయ శాతకుంభ శృం
గాలను మేలుకొల్పె నవకాంతులతో
మధుమాస; మాత్మ ప
క్షాలను విప్పి లేచెను వికస్వర
జీవమహోదయమ్మునన్"

—శేషేంద్ర

# చెస్లా మిలోత్స్

(1980 లో నోబుల్ బహుమానం పొందిన కవి)

## సిద్ధత

సిద్ధం చేసుకోడానికి మరో సంవత్సరం నా ముందు.
కనీసం రేపైనా ప్రారంభిస్తా నొక బృహద్గ్రంథం;
అందులో నా శతాబ్ది కళ్ళకు కట్టినట్లుంటుంది.
సజ్జనులమీదా దుర్జనులమీదా మండే సూర్యుడు
సకాలానికి వసంత శరత్తులు మళ్ళీ మళ్ళీ వస్తుంటాయ్
తడితడి పొదలో ఒక పక్షి మట్టితో కడ్తుంది గూడు.
మళ్ళీ తోడేళ్ళు తమ కుటిలోపాయాన్ని నేర్చుకుంటాయ్.

ఇదే వస్తువు, అనుబంధంతో బాటు. దానికి తోడు : సైన్యాలు
మంచుపడి గడ్డకట్టిన బయలులో పరుగెడ్తూ, అనేక ధ్వనుల
కోరస్‌తో శపిస్తూ; వీధికి మూలగా బృహదాకారంగా
పెరుగుతున్న ట్యాంకు ఫిరంగి; తొలిసంజలో ముళ్ళతీగ మధ్య
కావలి గోపురముండే సేనల విడిదికి పయనం.
లేదు, రేపలా కాదు, మరో ఐదు పదేళ్ళు కాదు.

నేనింకా తల్లుల్ని గురించే ఆలోచిస్తున్నాను
అడదానికి పుట్టిన వాడిస ఏమని అడుగుతున్నావు
ముడుచుకుపోతాడు, తల పట్టుకు కూర్చుంటాడు
ఇనుపబూట్లు వాడిని నలపబోతూంటే; నిప్పుల మీద
పరుగెడ్తూ భలే మెరుస్తాడు; బుల్‌డోజరొకటి
విసిరేస్తుంది వాడిని మట్టిగుంటలోకి.
ఆమె కొడుకు, ఆట బొమ్మను దాచి పెట్టుకున్న వాడు.
పరమ సుఖంతో గర్భంలోకి నడిచి వచ్చినవాడు.
నేనింకా ఎలా మాట్లాడాలో అలా మాట్లాడడం
నేర్చుకోలేదు, శాంతించండి.

మరెప్పుడూ పరుగెత్తకండి, నిశ్శబ్దం. ఎంత మృదువుగా
వాన కురుస్తోంది నగరంలో ఇంటికప్పుల మీద. అన్నీ
ఎంత పరిపూర్ణంగా ఉన్నాయిక్కడ. కావలిగోపురం కిటికీ దగ్గర
హంసతూలికాతల్పం మీద నిద్రలేస్తున్న మీ యిద్దరికీ ఇప్పుడు.
మగవాడికీ ఆడదానికీ, మగగా ఆడగా రెండు భాగాలుగా
పరస్పరం స్పందించే ఒక చెట్టుకు.
అవును, ఇది మీకు నా బహుమతి, కఠినమైన
కఠినమైన నేలమీదున్న బూడిద మీద తగవులాట,
శపథాల రహస్యప్రతిధ్వని గురించి, ఎందుకంటే మీరు
ఇప్పుడు లేవెలుగులో మేల్కొవాలి: వంచిన తల,
దువ్వెన పట్టుకున్న చేయి, అద్దంలో రెండు ముఖాలు
జ్ఞాపకం లేకున్నా కనపడేది ఎప్పటికీ ఒక మారే, ఒక సారే,
కరిగిపోతున్నా మీరు గమనించాలని; అస్తిత్వం యొక్క
పండగలో ఒక్కొక్క క్షణమూ మీరు కృతజ్ఞులుగా ఉండాలని.
బూడిదరంగు ముత్యాలవెలుగులో వేసవి తుంపర్ల వానలో.
పాచి బట్టిన రాతి ప్రతిమలుండే చిన్న పార్కు
మీరు తలుపు తెరిచినప్పుడు ఎలావుందో అలాగే ఉండనివ్వండి.
మళ్ళీ మీ ప్రీతి, ఉన్నట్లుండి మారిపోయిన
పొడుచుకు వస్తున్న ఎత్తైన పోర్టికోల వీధి.

(ప్రసిద్ధ కన్నడ కవి గోపాలకృష్ణ అడిగగారి కన్నడానువాదంనుంచి తెనుగు సేత ఆర్వీయస్. సుందరం)

మిలోత్స్ 1911 లో లిథువేనియాలో పుట్టాడు. పోలిష్ కావ్యానికి కొంగ్రొత్త సొగసులు ప్రసాదించాడు. సుమారు 12 కవితా సంకలనాలను ప్రకటించాడు. ఇతని కవిత్వంలో సమకాలీన మానవుని స్థితిగతులు, వలస వెళ్ళిన రచయిత అనుభవించిన పరకీయత ప్రధాన వస్తువులు.

## తావో యువాన్-మింగ్ (క్రీ.పూ. 4 శతాబ్ది)

### ప్రమత్తుడు-అప్రమత్తుడు

ఒక అతిథి నాలో నివసిస్తున్నాడు,
మొత్తం మా అభిరుచులన్నీ సమానం కాని,
మాలో ఒకడు చిత్తుగా త్రాగి వున్నాడు;
ఇంకొకడు ఎప్పుడూ అప్రమత్తుడు.
అప్రమత్తత, ప్రమత్తత-
మేం ఒకరి నొకరం అపహాస్యం చేసుకుంటాం,
ఒకడి ప్రపంచం మరొకడికి అర్థం కాదు.
ఔచిత్యాలూ, సాంప్రదాయాలూ-
మనః పూర్వకంగా పాటించడం ఎంత తప్పు?
గర్వంగా ఉండు, ఏమీ పట్టించుకోకు;
అప్పుడు నీకు జ్ఞానోదయమవుతుంది.
మందుకొట్టిన ముసలి పీనుగా, విను,
పగలు చనిపోతున్నప్పుడు,
ఓ దీపం వెలిగించు.

(యాంగ్ యెహ్-త్జు ఆంగ్లానువాదానికి తెనిగింపు-తంగిరాల)

### అజ్ఞాత కవి (క్రీ.పూ. 1 వ శతాబ్ది)

(సామాన్య మానవుల్ని ఖననం చేసేటప్పుడు పాడే పాట)

ఈ శ్మశాన భూమి ఎవడిది?
ఇది దెయ్యాలతో క్రిక్కిరిసిన కొంప-
జ్ఞానులూ, మూర్ఖులూ భుజంభుజం రాసుకుంటూ,
రుద్రుడికి అందరూ తన వాళ్లే;
మానవుని విధికి జాగు చేయడం తెలియదు.

(ఆర్థర్ వ్యాలీ ఆంగ్లానువాదానికి తెనిగింపు—తంగిరాల)

# అమీన్ కస్సమ్

## సూర్యాస్తమయం

వెచ్చని సువాసన జాగు చేస్తుంది
ఆకులగుండా
పరిమళ శ్వాసలు తీసే
పుష్పాలగుండా
అతని దారిని గుర్తించడానికి.
కొన ఊపిరితో వున్న
దొంగ కన్నుల క్రింద
తన పంజాల చీకటిలో
అతడు
తన
మంటల జాలు
పాతి పెడతాడు.
రక్త నేత్రాలతో
సగర్వంగా
నడిచిపోతాడు
పచ్చికలోకి.
రాత్రికి
అతని స్థానాన్ని
ఆక్రమించడానికి
వచ్చే
కొల్లగొట్టేవాణ్ణి చూసి
పక్షులు
ఆందోళనతో
కిచకిచలాడుతాయి.

(ఆంగ్లమూలానికి అనువాదం—తంగిరాల)

# యానిస్ రిట్‌సాస్

## జడత్వం

గదిలో చీకట్లో అతనొక్కడే ఏకాంతంగా సిగరెట్ తాగుతూ—
ఏవీ కనబడటం లేదు—అతని సిగరెట్ కొస నిప్పు వెలుగు మాత్రం
అప్పుడప్పుడు నిదానంగా జాగ్రత్తగా కదుల్తూ—
ఎలా అంటే, అతను జబ్బుపడ్డ పిల్లకి వెండిగంటెతో
ఏదో తినిపిస్తున్నట్టు-
ఏదో ఒక నక్షత్రం గాయాన్ని విన్న రెండంచుల కత్తితో
శుభ్రం చేస్తున్నట్టు-

## చేతులు

తరచుగా ఈ చేతులు ముఖాల్లా
లేదు, మొత్తం శరీరాల్లానే-
తరచుగా ఈ చేతులు ముఖాలు, శరీరాలు.
ఒక అపరిపక్వ వసంతంలో
ఈ చేతులు ఎంతో అసహనంగా, ఉత్సాహరహితంగా-
ఈ చేతులు తుమ్ముతాయి, దగ్గుతాయి
ఫిర్యాదు చేస్తాయి నిశ్శబ్దమయి పోతాయి.
ఎలా అంటే ఇద్దరు ముసలాళ్ళు వాడిపోయిన
    మర్మాంగాల్ని వేళ్ళాడేసుకుని దొడ్డికి కూచున్నట్టు
ఒక స్త్రీ పిల్లకి పాలిస్తూ వుంటుంది
ఆమె చేతులు—కదలక పోయినా—
పాలరాతి స్టేడియంలో పరుగెత్తుతున్న
ఇద్దరు దిగంబరులు.

(అనువాదం : కె. శివారెడ్డి)

యుగోస్లావ్ కవిత

## వాస్కోపోవా

### నిష్క్రమణం

ఇప్పుడు నేను ఇక్కడ లేను
ఇక్కడనుంచి ఒక్క అంగుళం కదల్లేదు
అయినా ఇక్కడ లేను
వాళ్ళని లోపలికి రానీ
వచ్చి చూడనీ వెతుక్కోనీ.
పక్కటెముకల నీడలో ఓ జలయంత్రం
శూన్యాన్ని చిలుకుతూ ఉంటుంది
చవకబారు స్వప్నాలు సిగరెట్ పీకల్లా
ఏష్ట్రేలో పొగలు కక్కుతూ ఉంటాయి
నేను మాత్రం ఉండను.
పగిలిన పడవ ఒకటి ఎర్రకెరటాల మీద
కొయ్యగుర్రంలా ఊగుతూ ఉంటుంది
బాగా పండబారని పదాలేవో
గొంతులో మబ్బుల్లా చిక్కుపడి ఉంటాయి
నేను మాత్రం ఉండను.
ఉన్న చోటునుంచి అంగుళం కదల్లేదు
కాని చాలా దూరం పోయాను
బహుశా వాళ్లు నన్ను అందుకోలేరు

(ఏన్ పెనింగ్టన్ ఆంగ్లానువాదంనుంచి తెనిగింపు : కె. గోదావరి శర్మ)

# ఆయెషా ఝురోలిచ్

## కవితాకాహః

గతించిన సంవత్సరాల జ్ఞాపకాలలో
ఆర్తినై, భావస్ఫూర్తితో
ప్రతిరోజూ నమ్మకంతో
విభిన్న క్షణాలను సమ్మిళితం వేసుకుంటూ
దశాబ్దాలుగా శిలాక్షణాలను దాటుకుంటూ
నా కవితను సాగిస్తాను, లేదా!
ఈ ప్రపంచంనుంచి సుదూరంగా
నిష్క్రమించదలచుకున్నాను నేను
సముద్ర గర్భంలో దాక్కోవాలనుకున్నాను నేను
గీతికాస్వనం స్వరంగా నిలవాలని నా ఆకాంక్ష.

## వీక్షణ

నా ప్రేమను అందించటానికి
అవిశ్రాంతంగా నిరీక్షిస్తున్న నా కళ్ళలా
సొగసుగా లేని సూర్యుడు
విరబోసుకున్న శిరోజాల్లాంటి
నా కవితలో చిక్కుకుని
విశ్రాంతి తీసుకుంటున్నాడు.

## అనుభూతి చేవ్రాలు

వెన్నెల కాంతుల్లో
'డ్రినో' వంతెనపై నిలబడి
వివర్ణమైన తరంగాన్ని చూస్తున్నట్లుగా
కదులుతున్న స్ఫటిక తరంగాలు
బహుదూరంగానుండి సంభ్రమాశ్చర్యాలు
కలిగిస్తున్నాయి క్షణంక్షణం

(తెనుగుసేత : టి. శ్రీరంగస్వామి)

## సిద్ధలింగయ్య

### నా కవిత

గుడిసెలో వికసించు గులాబి
నక్షత్రం నా కవిత
చీకటిలో కనిపించు వెలుతురు
తిరుగుబాటు ఈ కవిత.

బ్రతుకును ప్రేమించే బీదవారి అమ్మాయి
నిరాభరణ సుందరి కవిత
ప్రజలు తినే అన్నం మెతుకు
జీవం నా కవిత.

పొంగిపారే నెత్తురు సెలయేరు
ఎరుపుకడలి కవిత
మగువరాల్చు కన్నీటి బొట్టు
నా పొట్టి కవిత

అడవిమధ్యన దిక్కు తెలియని వారికి
కనబడ్డరోడ్డు నా కవిత
అర్ధ రాత్రిలో వణికే జనులకు
ధైర్యమిచ్చు కవిత

ఎడారిలో వీస్తున్న
తుఫాను కవిత
రాజభవంతుల్లో దొర్లుతున్న
బావు నా కవిత.

గొర్రెలు కాచే కాపరి కూత
ప్రజల మాట కవిత
పోలిన రెక్కల అలసిన కాళ్ళ
చెమట పంట కవిత.

నా వారితో నే పలికిన పలుకులు
నేనర్పించు కవిత
నా జనులను నే చూచిన తీరు
నా మదిలోని కవిత.

## బి. పి. రామచంద్రశర్మ

### కురిసింది వాన

నూటరెండు డిగ్రీల జ్వరంతో కాలిన
దేహపు నాడులు పరితపించేలా
మడిగలవారింటి బాలింతలా
వేచినది నేల వానకై తపిస్తూ,
ఐదు మాసాలు నిండి పారిన జలాన్ని స్వప్నిస్తూ,
అప్పుడు కురిసింది వాన, వాన కురిసింది.

ప్రేమ పిలుపులు విన్న
తల్లి శబరి వద్దకు వచ్చి నిలిచాడు రాముడు!
ఆ రామునిలా,
తల్లడిల్లిన పాపాయి కన్నీరు తుడవాలని
వచ్చిన తల్లి మృదు హస్తంలా,
కంటిని ముద్దిడు కునుకులా
ఏకాకి బ్రతుకులో వచ్చే ప్రేమానుభూతిలా
కాలిన పుడమి ప్రేమ పిలుపు మన్నించినట్లు
కురిసింది వాన, వాన కురిసింది.

ఆనందంతో గంతులేస్తూ
వచ్చింది వాన కొండ సీమలనుంచి
నవ్వులొలుకుతూ భువిలేచి ప్రేమ సంబరాలతో
పలికింది స్వాగత విలాస హేల.
మహలుపై వాన ఆడింది లీలగా; అలా అలా
గుడిసెల మీదా బందిఖానాల మీద కూడా.
కిటికీలో నిలిచి గుసగుసలాడింది వాన
పారింది మురికిలో క్షణంలోన
వానై, సెలయేరై భువికి దిగివచ్చెనా ప్రేమ
అన్నట్టు కురిసింది వాన
వాన కురిసింది; కురిసింది వాన.

## రమజాన్ దర్గా

**జంకు**

| | |
|---|---|
| మొగుడు : | సమరానికి పోయినవాడు<br>తిరిగి రాలేక పోయాడు. |
| కొడుకు : | రేయి చూపిన చుక్కల్ని<br>పగటి పూట లెక్క పెడ్తాడు. |
| కూతురు : | మురికి వాడల్లో<br>పరికిణీ విప్పుతుంది. |
| నేను : | చెప్పాలంటే<br>నా గొంతుకు కేన్సర్ సోకింది. |

(పైమూడు కవితల తెనిగింపు—ఎస్. రఘునాథ)

# బాలచంద్రన్ చుళ్ళిక్కాడ్

## శాంతి

నేను రాజుకు భయపడేవాణ్ణి కాదు
అందువల్ల ప్రజలకు సత్యం చేప్పే బాధ్యత నా మీదుంది.
మన శాంతి
రెండు బాణాసంచాలను కలిపే మందుగుండు విరామకాలం
అది నిప్పుకోసం కాచుకునుంది.
మన శాంతి
స్పందించే హృదయానికీ చొచ్చుకునే బయనెట్టుకూ
మధ్య ఉండే దూరం
అది ప్రతి నిమిషం తగ్గుతూ వస్తుంది.
మన శాంతి
అర్ధ నగ్న శరీరంలో చొచ్చుకు పోయిన మూడు తూటాల
రామనామ జపం.
అది దేశాన్ని రక్షించదు.
మన శాంతి
ఎడమబుగ్గపై దెబ్బతిని కుడి బుగ్గను చూపించలేక
కుప్పకూలుతున్న అవసాన శ్వాస
అతను మరణించవచ్చు.
మన శాంతి
ప్రతివాది బోనులో
నిశ్శబ్దంగా నిల్చున్న వాది
విధి ఎప్పుడూ అతనికి చుక్కెదురు.
నేను మరణానికి భయపడను
దాన్ని మోసే జీవితాన్ని గురించిన
సత్యాన్ని చెప్పే బాధ్యత నా మీదుంది.

(తెనుగుసేత—ఆర్వీయస్. సుందరం)

# చైతన్య కవితా వేదిక

అధ్యక్షులు : డా. తంగిరాల సుబ్బారావు

కార్యదర్శి : డా. ఆర్వీయస్. సుందరం

కోశాధికారి : డా. సరగు కృష్ణమూర్తి

సహకార్యదర్శి : పి. యు. బి. శర్మ

## పోషకులు

శ్రీయుతులు

1 సి. ఎన్. రెడ్డి, మైసూరు
2 రమణయ్యరాజా, మద్రాసు
3 ఇందిరాదేవి ధనరాజ్‌గిర్, హైదరాబాదు
4 సకలా నరసింహులు శ్రేష్ఠి, బెంగుళూరు
5 తిక్కవరపు పట్టాభిరామి రెడ్డి (పఠాభి), బెంగుళూరు
6 యస్. స్వతంత్రరావు, ఐ.ఏ.ఎస్., దంపతులు, బెంగుళూరు
7 రుక్మిణి, బుల్లా సుబ్బారావు, ఐ.ఏ.ఎస్., దంపతులు, బెంగుళూరు
8 వై. వి. వెంకటేశ్వరరావు, బెంగుళూరు
9 కె. పి. రావు, బెంగుళూరు
10 శంకరి, కల్నల్ టి. కె. మూర్తి దంపతులు, 99 ఎ.పి.ఒ.
11 బాలాత్రిపురసుందరి, తంగిరాల భాస్కరరావు దంపతులు, రాజమండ్రి
12 మార్కండపురం శ్రీనివాస, బెంగుళూరు
13 డా. జి. సుధ, డా. జి. సాంబశివరావు దంపతులు, గుల్బర్గా
14 విట్టూరి బాపినీడు, తణుకు
15 రాజేశ్వరి, సి. వెంకటయ్య దంపతులు, బెంగుళూరు
16 ఆచార్య జి. ఎన్. రెడ్డి, తిరుపతి
17 కుందుర్తి వేంకటశాస్త్రి, డా. కుందుర్తి సత్యనారాయణగార్లు, విజయవాడ

## జీవిత సభ్యులు

1986 (1–40 చైతన్య కవిత-2లో ప్రచురితం)

1987 శ్రీయుతులు

41 బట్లూరి రామచంద్రయ్య, తుంకూరు

42 ఎ. కొమరయ్య
43 ఎస్. వెంకటమునిరెడ్డి, తుంకూరు
44 చిటిప్రోలు కృష్ణమూర్తి, గామాలపాడు (గుంటూరు జిల్లా)
45 ఎం. రుక్మాంగద నాయుడు, బెంగుళూరు
46 కె. మన్మథరావు, తూడి (శ్రీకాకుళం జిల్లా)
47 కె. కె. వి. శర్మ, హైదరాబాదు
48 ఎం. మహేశప్ప, గుడిబండ
49 ఎం. ఎన్. ఆదినారాయణ శెట్టి, బెంగుళూరు
50 మహమ్మద్ హుస్సేన్, హైదరాబాదు
51 బి. సత్యనారాయణ గుప్త, హిందూపురం
52 ఎస్. సుజాత, హైదరాబాదు
53 కె. రాజమల్లాచారి, మార్కాపురం
54 గుజ్జుం చెన్నారెడ్డి, తిరుపతి
55 ఆచార్య ఎం. సుబ్బారెడ్డి, తిరుపతి
56 డా. నారాయణ, బెంగుళూరు
57 డా వెంకటస్వామి రెడ్డి, బెంగుళూరు
58 డా. ముదిగొండ వీరభద్రయ్య, నిజామాబాదు

## ప్రత్యేక సభ్యులు

## 1986 (1–15 చైతన్య కవిత-2లో ప్రచురితం)

### 1987 శ్రీయుతులు

16 డా. కె సర్వోత్తమరావు, తిరుపతి
17 ఆచార్య ఎల్. బి. శంకరరావు, మద్రాసు
18 ఆచార్య వి. రామచంద్రన్, మద్రాసు
19 ఆచార్య డి. చిన్నికృష్ణయ్య, మద్రాసు
20 ఆచార్య మాదిరాజు రంగారావు, వరంగల్లు
21 ఆచార్య ఎం. కులశేఖరరావు, హైదరాబాదు
22 ఆచార్య యస్వీ. జోగారావు, విశాఖపట్నం
23 డా. ఆర్. శ్రీహరి, హైదరాబాదు
24 డా. ఎం. రాజారావు, తిరుపతి
25 భార్గవి పి. రావ్, హైదరాబాదు
26 అనిమెళ్ల వేంకట విజయరామరాజు, విజయవాడ

27 డా. కె. సంపత్కుమారాచార్య, వరంగల్లు
28 పువ్వాడ తిక్కన సోమయాజి, అనంతపురం
29 సి. సుశీలా నాగరాజ్, మైసూరు
30 ఎన్. ఎస్. శారదాప్రసాద్, మైసూరు
31 జి. విజయసారథి, మైసూరు

"చాపచింపు-సామ్రాజ్యం
కోడిగుడ్డు–కోహినూరు
పాటిమన్ను–ప్లాటీనం
బస్సుసీటు–బ్రహ్మరథం
ఏదైతేం ఏదైతేం" —కాళోజీ

# చైతన్య కవితా వేదిక

ప్రభవ వసంతం **3** SPRING 1987

"ఉదయం కానే కాదనుకోవడం నిరాశ
ఉదయించి అట్లానే వుండాలనుకోడం దురాశ" — కాళోజీ

సౌభాగ్య
డా. ఎన్. గోపి
అద్దేపల్లి రామమోహనరావు
ఆచార్య తిరుమల
కోట్ల వేంకటేశ్వర రెడ్డి
ఆసు రాజేంద్ర
కందాళై రాఘవాచార్య
ఆర్. సీతారామారావు
డా. అమ్మంగి వేణుగోపాల్
ప్రసేన్
డా. రాజేశ్వరి దివాకర్ల
నిఖిలేశ్వర్
ఆచార్య పేర్వారం జగన్నాథం
ఆర్. ఎస్. సుదర్శనం
ఎ. శ్రావణ్ కుమార్
తంగిరాల సుబ్బారావు
కె. గోదావరి శర్మ
డా. నాయని కృష్ణకుమారి
అఫ్సర్
ఇంద్రాణి
కె. మురళి
డా. ఎస్. జి. డి. చంద్రశేఖర్
డా. పి. ఎల్. శ్రీనివాస రెడ్డి
కీ. శే. దేవరకొండ బాలగంగాధర తిలక్
రామాచంద్రమౌళి
ఆర్వీయస్. సుందరం
ఆచార్య తుమ్మపూడి కోటీశ్వరరావు
ఆచార్య యస్వీ జోగారావు
ఆచార్య డి. వి. కె. రాఘవాచార్యులు

పోలిష్, చైనా, ఆఫ్రికా, గ్రీక్, యుగోస్లావ్, కన్నడ, మలయాళ కవితలు